

ది. 10-8-86 న జరిగిన ప్రమాణపత్ర వితరణోత్సవము, గుంటూరులో
జరిగిన సమావేశంలో డా. వి. నాగేశ్వరరావు M.Sc (Tch) Ph D; BEd.
(జిల్లా పరిషత్ విద్యాశాఖాధికారి, గుంటూరు) తమ మధ్యమ సర్టిఫికేట్, కార్యదర్శి గారి
కరకమలములనుండి స్వీకరించుచున్న సమయమున తీసిన ఫోటో.

## హిందీ మీడియం

# బి. ఏ. డిగ్రీ కళాశాల

## 1986 నవంబరులో ప్రారంభం

ఉచ్చ శిక్షా ఔర్ శోధ్ సంస్థాన్ (పోస్టుగ్రాడ్యుయేట్ అండ్ రిసెర్చి కాంప్లెక్స్) పక్షాన మద్రాసులోనూ, హైదరాబాదులోనూ ఎమ్.ఎ., ఎమ్.ఫిల్., పి.హెచ్.డి, కంప్యూటర్ అనువాద డిప్లొమా పరీక్షలునడుపబడుచున్నవి. ఈ సంవత్సరం హిందీ మాధ్యమంతో బి.ఏ డిగ్రీ కళాశాలను (మాచవరం) విజయవాడలో నడుపుటకు సంస్థాన్ దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర సభకు అనుమతి నిచ్చినది. ఈ కళాశాలలో క్రింది యోగ్యతలు కలవారు ప్రవేశము పొందవచ్చును.

(1) ఇంటర్మీడియట్, పి. యు. సి, +2 హిందీతో ఉత్తీర్ణులైన వారు,

(2) ఇంటర్మీడియట్, పి. యు. సి., +2 ఉత్తీర్ణులై ద. భా హిందీ ప్రచారసభ వారి రాష్ట్రభాషా విశారదలో ఉత్తీర్ణులైనవారు

(3) దక్షిణ భారత హిందీ ప్రచార సభ వారి రాష్ట్రభాష విశారద లోనూ, యస్ యస్.సి.లోనూ ఉత్తీర్ణులై నియమానుసారం ఉచ్చశిక్షా ఔర్ శోధ్ సంస్థానంలో తమ పేరు రిజిష్టరు చేయించుకొని, సంస్థానం తరఫున నడిపించబడు ఇంటర్మీడియెట్ ఇంగ్లీషు ప్రశ్నపత్రాలు రెండింటిలోనూ ఉత్తీర్ణులైన వారు.

ఇంటర్మీడియెట్ ఇంగ్లీషు పరీక్షను రాబోవు మే నెలలో సంస్థానం నడిపించ గలదు. ఈ పరీక్షకు హాజరు కాదలచినవారు 30, నవంబరు

1986 లోపల రిజిస్ట్రేషను రుసుము 25/-లు పంపించి తమ పేరు రిజిష్టరు చేయించుకొనవలెను. రిజిస్ట్రేషను పూర్తి అయిన తరువాత పరీక్ష దరఖాస్తులు పంపవచ్చును.

పరీక్ష రుసుము రు. 40 = 00

దరఖాస్తు ఫారం రు 2 = 00

బి. ఏ డిగ్రీ కళాశాలలో ప్రవేశము పొందగోరు వారు దరఖాస్తు ఫారం మరియు నియమావళి కొరకు రూ. 10 = 00 లు IPO గాని, డ్రాఫ్ట్ గాని. ఈ క్రింది చిరునామాకు పంపవలెను.

**ఇతర వివరాలకు**

1. రిజిష్ట్రార్,
హిందీ స్నాతకోత్తర విభాగం,
దక్షిణ భారత హిందీ ప్రచార సభ- (ఆంధ్ర)
ఖైరతాబాదు హైదరాబాదు- 500004

లేక

2. కార్యదర్శి
దక్షిణ భారత హిందీ ప్రచార సభ, (ఆంధ్ర)
ఖైరతాబాదు, హైదరాబాదు- 500004

లేక

3 శ్రీ ప్రధానాచార్యులు,
హిందీ మీడియం డిగ్రీ కళాశాల
మాచవరం, విజయవాడ-520 004

హిందీ ప్రచారకులు, హిందీ భాషాభిమానులు, విద్యార్థులు, ఈ సదవకాశాన్ని వినియోగించుకొనగలరని విశ్వసిస్తున్నాము.

**వే. ఆంజనేయ శర్మ.**
రిజిష్ట్రారు.



## సాహిత్య మాస పత్రిక

# 389, 390


సెప్టెంబరు, అక్టోబరు, 1986

సంపుటి : 33, సంచిక 6, 7

వార్షికచందా : పదిహేను రూపాయలు

విడిప్రతి : రూపాయిన్నర



సంపాదకులు

ఎ. రామస్వామి

# ఈ సంచికలో

సంపాదకీయం

# వార్తల్లో హిందీ

హిందీ మరల వార్తల్లోకి వచ్చింది. సెప్టెంబర్ 14 హిందీ దినోత్సవము, ఆనాటి నుండి ప్రారంభమయిన హిందీ వారోత్సవ సందర్భంగా కేంద్ర ప్రభుత్వ కార్యాలయాలలో హిందీ వాడకాన్ని గూర్చి ఒక సర్క్యులర్ వెలువడింది కేంద్ర ప్రభుత్వ కార్యాలయాలలో పనిచేసే ఉద్యోగులు ఆ వారం కనీసం సంతకమయినా హిందీలో చేయాలని ఉటంకించ బడిందట దీనిని హిందీని బలవంతంగా రుద్దటంగా భావించిన ఉద్యోగులు వ్యతిరేకించారని, దానివలన కల్లోల పరిస్థితి నెలకొన్నదని. కేంద్ర ప్రభుత్వం వెంటనే ఆ సర్క్యులర్‌ను ఉప సంహరించుకొని బలవంతంగా హిందీని ప్రవేశపెట్టము అని రాజ్యాంగబద్ధమైన హామీ ఇవ్వా లని, అందుకై ఉద్యమం ప్రారంభిస్తున్నామనీ ఆ ఉద్యమంలో భాగంగా హిందీని అధికార భాషగా ప్రకటించే రాజ్యాంగంలోని 19 వ అధికరణాన్ని తగులబెడతామనీ డి ఎమ్ కె అధ్యక్షులు శ్రీ కరుణానిధి ప్రకటించారు. దానిపై ఉత్తరాది నాయకుల ప్రకటనలు, వాదోప వాదాలు జరుగుచున్నై. ఈ విధంగా హిందీ మరల వార్తల్లోకి వచ్చింది. రావణకాష్ఠం మరల మండటం ప్రారంభమయింది. అయితే ఈసారి ఆయా పత్రికలు ఈ విషయంపై ఆవేశ కావే శాలకు లోనుగాక సమస్య పూర్వాపరాలను సమీక్షించ పూనుకోవడం శుభసూచకం.

ఈ సమస్యలో రెండు విషయాలు ఆలోచించవలసినవి ఉన్నవి. మొదటిది కేంద్ర ప్రభుత్వం గాని, ఆ ప్రభుత్వంలోని కొంతమంద అధికారులు గాని హిందీని అమలుపర్చే విష యంలో తొందరపడుతున్నారా అన్నది. రెండవది ఏ రాజకీయ పక్షమయినా ఉద్యమం నిర్వ హించదలిస్తే ప్రజల అభిప్రాయం ఎలా ఉంటుందన్నది.

మొదటి విషయాన్ని గూర్చి కేంద్ర ప్రభుత్వమిచ్చిన వివరణ— ఈ సర్క్యులర్ ప్రతి సంవత్సరం ఇచ్చే సర్క్యులర్ వంటిదేననీ కనుక దీనిపై ఆందోళన చెందవలసిన అవ సరం లేదని. అయితే ఈ సర్క్యులర్‌ను వ్యతిరేకించే ఉద్యోగులు ఒక విషయం ఆలోచించాలి. హిందీ రాజ్యాంగం, పార్లమెంటు ఆమోదించిన ప్రభుత్వ భాష. దాని అమలు విషయంలో ఉద్యోగులు కొంత అనుకూల భావంతో వ్యవహరించవలసి ఉన్నది. ఆ భాష లిపిలో సంతకం చేయడానికి ప్రయత్నమయినా చేయమనటం సరియైన పద్ధతి కాదు. భావితరంవారి అవసరాల నయినా దృష్టిలో పెట్టుకొని పట్టు విడవడం మంచిది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రజలలో ఒక వంక ఇంగ్లీషుపై మోజు పెరుగుతున్న కొలదీ దానిపై పట్టు తప్పుతున్నదన్నది స్పష్టం. అనేక సందర్భాలలో రాజకీయ నాయకులు దేశభాషల అభ్యున్నతిని గూర్చి, ప్రభుత్వంలోను ఇతరత్రాను వాటి వాడకం క్రమబద్ధంగా

పెంచవలసిన అవసరాన్ని గూర్చి చెబుతూ వచ్చారు. కొన్ని రాష్ట్రాలలో అయితే ఆ రాష్ట్రానికి చెందిన భాషా నినాదంతోనే ప్రభుత్వంలోకి రావడం జరిగింది. ఇంగ్లీషుపై ఎంత మోజు పెరిగినా విద్యాసంస్థలలో దేశభాషలు బోధనాభాషలు కావడం, కొత్త తరానికి చెందిన యువతీ యువకులు దేశభాషల ద్వారా విద్య గరపటం జరుగుతున్నది. ఇటువంటి వారు కొద్ది పాటి ట్రైనింగు ఇచ్చినట్లయితే దేశభాషలలో ప్రభుత్వ కార్యకలాపాలను నిర్వహించగల రనటంలో సందేహం లేదు. ఈ విధంగా ఎంతో కొంత కాలానికి ఆయా రాష్ట్రాల పరిపాలన పూర్తిగా దేశభాషలలో జరుగుతుందన్నది తథ్యం. అట్టి పరిస్థితిలో కేంద్ర ప్రభుత్వంలోను అఖిల భారత సర్వీసులలోను ఈనాడున్న పరిస్థితిలో కూడ మార్పు రావడం సహజం. ఆ మార్పు హిందీకే అనుకూలంగా ఉంటుందన్నది స్పష్టం.

రాజకీయంగా కేంద్ర ప్రభుత్వ కార్యకలాపాలలో హిందీ వాడకాన్ని వ్యతిరేకించేవారు కూడ ప్రభుత్వేతర కార్యకలాపాలలో హిందీ వాడకం నిరాఘాటంగా సాగుతూండడం గమ నించే ఉంటారు. ఇప్పటికే దక్షిణాది రాష్ట్రాలలో తమ పొరుగు రాష్ట్రంలో హిందీతో పబ్బం గడుపుకోగలగటం సంభవంగానే ఉన్నది. తూర్పున ఒరిస్సా పడమర మహారాష్ట్రతో ప్రారం భించి ఉత్తరాది రాష్ట్రాలన్నిటిలోను హిందీతో సులభంగానే నెగ్గుకు రావడం జరుగుతోంది. వ్యాపారరంగంలో అయితే హిందీ అనుసంధాన భాషగా ఇప్పటికే చాలవరకు చలామణిలో ఉన్నది, కొత్తతరంవారిలో ముఖ్యంగా విద్యార్థి వర్గంలో ఇదివరకటి సందిగ్ధ స్థితి లేదు. ఎంతో కొంత హిందీ భాషా పరిజ్ఞానం భవిష్యత్ జీవితానికి అవసరమనే వారు భావిస్తున్నారు. ఇటువంటి స్థితిలో పట్టుదలకు పోయి హిందీ వ్యతిరేకత ప్రకటించిడం విజ్ఞత అనిపించుకోదు. ఈనాడు హిందీ పరిజ్ఞానం లేని ఉద్యోగుల ప్రయోజనాలకు భంగం కలుగని విధంగా భావి తరం వారి ప్రయోజనాలకు అనుగుణంగా వ్యవహరించడం ఉద్యోగస్థుల, రాజకీయ నాయకుల వివేకాన్ని వ్యక్తం చేస్తుంది.

ఇక కేంద్ర ప్రభుత్వం కూడ సున్నితమయిన భాషాసమస్య విషయంలో హిందీ భాషే తరులకు నొప్పి కలుగని విధంగా వ్యవహరించడం అవసరం. కేంద్ర నాయకులు ఈ విష యంలో చాకచక్యంతో ప్రవర్తించాలి. దేశంలో ప్రతి సమస్య మీద భిన్నాభిప్రాయాలున్నాయి. భాషా సమస్య విషయంలోను ఉన్నాయి. భిన్నాభిప్రాయాలున్నంత మాత్రాన ఎవరినీ దేశ భక్తి లేనివారుగా పరిగణించరాదు. వెనుకటి ప్రధాన మంత్రులు— నెహ్రూ, ఇందిరాగాంధీలు ఈ దృష్టితోనే హిందీభాషేతరులకు అధికారభాష హిందీ విషయంలో కొన్ని హామీలు ఇచ్చి ఉన్నారు. ప్రస్తుత ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ కూడ ఆ హామీలను పునరుద్ఘాటించడం ముదావహం. దీనిని దృష్టిలో పెట్టుకొని ఇతర నాయకులు రెచ్చగొట్టే ప్రకటనలు చేయకుండా ఉండటం అవసరం.

భాషా విషయంలో వాతావరణం కలుషితం కాకుండా ఉండే కాలం ఈ సమస్యను పరిష్కరిస్తుందనడంలో సందేహం లేదు.

## విలయ గోదావరి

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

భద్రమనుకొన్న, యా
భద్రగిరి పై ప్రాకి
వీథులను నీ వెంతో
విలయ తాండవమాడి

పరవళ్లు చూపితే
గోదావరీ !
పలుగెత్తిరే, జనులు
గోదావరీ !

గిరిజనుల గుడిసెలను
గిరగిరాగిర త్రిప్పి
కళ్లముందటె, వారి
యిళ్లు ముంచెత్తగా

కుప్పకూలిరె వారు
గోదావరి, గ్రు
డ్లప్పగించిరె నీకు
గోదావరీ !

నీళ్లలోపల నుండు
ఊళ్లెపోల్చగ నీక
విజ్జృంభించు నీవు
ఉజ్జాగి పోయితివి

కన్నీరు కార్చిరే
గోదావరీ జలము
మున్నీరు మించినది
గోదావరీ !

21-6-12, సుబ్బరామశాస్త్రి స్ట్రీట్,
పైడిపాటి నగర్, విజయవాడ-4.

## బొమ్మా-బొరుసూ

—డా॥ తంగిరాల సుబ్బారావు

న్యాయం, ధర్మం
నీతి, నియమం,
కడుపు నిండినవాడికి—
ఇవేవీ అర్థం లేనివి
కడుపు మండినవాడికి

కవిత్వం, సంగీతం,
కళలు, సాహిత్యం,
కడుపు నిండినవాడికి—
ఇవేవీ పనికిరానివి
కడుపు మండినవాడికి

వినయ విధేయతలు
విశ్వాసం, క్షమ, శాంతి,
కడుపునిండిన వాడికి రూల్సుబుక్కు !
ప్రశ్నించడం, తిరుగబడటం
విప్లవాల్ని సృష్టించడం
కడుపుమండిన వాడికి జన్మహక్కు !!

తెలుగు పండితులు,
బెంగుళూరు యూనివర్శిటీ
బెంగుళూరు 560 056

# కబీర్ సూక్తులు

తెలుగు సేత. ఈ. దయానంద

[సుప్రసిద్ధ హిందీ కవి కబీరు రచించిన దోహాలకు అనువాదాన్ని ధారావాహికంగా ప్రచురిస్తున్నాము. సం॥]

సత్యమునకు తపము సరితూగదెన్నడు
అనృత సదృశమైన అఘములేదు
సత్యమెవనియందు నిత్యమై విలసిల్లు
నతనిహృదిని దైవ మధివసించు

సాధువుండవలయు సదసద్వివేకియై
శూర్పసదృశుడగుచునేర్పుమీర
సారమున్నదాని సంగ్రహించుచు ఒట్టి
పొట్టునెల్లయెగుర గొట్టవలయు

శీఘ్రగతిని తిరుగు చేతిలో జపమాల
నాట్యమాడుచుండు నాల్క నోట
చిత్తమెల్లదిశల చిలిపిగా విహరించు
జపముగాదు కొంగజపమెగాని

కీడుమూడినపుడు కీర్తింతురందరు
సుఖములందు ముఖము చూడబోరు
సౌఖ్యమందుగూడ సంస్మరించుచునున్న
బాధలేలగల్గు సాధువులకు ?

ముల్లుగ్రుచ్చువానికెల్లవేళల నీవు
పూలుగ్రుచ్చుమతని జాలి దలచి
పూవులెల్లనీకు పూవులే అనిపించు
అతని కవి త్రిశూల వితతులగును.

# వేణుపర్జన్యం

—కొంపెల్ల రామకృష్ణమూర్తి

ఆ పాదాలు నాకు సుపరిచితాలు
దవనం చిగుళ్ళమీద
పరిమళాలు వాలినంత సుతారంగా—
ఒక్క రంగులచేప-అక్వేరియంలో
నిశ్శబ్దసౌందర్యవలయాన్ని
విసిరినంత సున్నితంగా-
ప్రవాసేవ్యవధిని కూడా భరించలేక
గుండెలో సుడితిరిగే ఉత్పలమాలికల్లా—
    వడివడిగా
    పూల జడిజడిగా
    అవి విహరించటం
    నిమేషణలను హరించటం
    ఎలా మరచిపోవటం ?
ఆ ప్రతుకు మొగ్గమీద
ఏ నెమలిపింఛపు చూపుకొసలు
అష్టపదులు వ్రాశాయో
ఆ పాటలాధరాల మీద
ఎన్ని ఆశ్చర్యాలు, ఆనందాలు
కోపాలు, తాపాలు
చేమంతులై, గులాబులై
మందారాలై, మంకెనలై
ప్రాణం పోసుకున్నాయో
ఎలా చెప్పగల్గటం ?
    ఆ పాదాలు నడుస్తున్నాయిప్పుడు
    అగాధాల్లోకి !
    పిచ్చిమొక్కలు విసిరే
    విచ్చుకత్తుల అడవుల్లోకి !
పరిమళ శిశువు-
సుడగాలి తిరునాళ్ళలో తప్పిపోయిందయ్యా !
శమ్మనికథ ముళ్ళకంచికి చేరిందయ్యా !
ఆరే....ఆ అధరాల మీద పువ్వులెవ్వయ్యా !
ఈ పల్లవిలో పల్లేరులేమిటయ్యా !

సీనియర్ తెలుగు పండిట్, యస్.సి. హైస్కూల్,
క్వార్టర్ నం. టి-10, రామకృష్ణాపురం,
ఆదిలాబాద్-504301.

# "ప్రేమ సుందరి"

రచన:పొరండ్ల సత్యనారాయణ

గులాబీరేకుల ఎర్రదనం
చలకీ నవ్వుల చక్కదనం
కన్నులలోన కలికితనం
మేనులోన వన్నెతనం
చూస్తుంటే చూడాలని ఉంది !

నీవు నా స్వంతం కావాలని ఉంది
నీ ప్రేమ నెప్పుడో నేను కోరుకున్నాను !!

నీ హృదయంకోసం మదనుని బాధను సహించాను
నీవెవరో నాకు అంతగా తెలియకున్నా,
నా హృదయం ఆరాటంతో, నీ హృదయాన్ని
పెనవేయాలనుకుంది-ప్రేమపొంగినప్పుడు !!!

అయినా ! నీ అనుమతికై ఎదిరిచూసాను
నాలో చెప్పలేని బుగులు
నాగుండెలోన గుబులు
నన్ను నీవు కలవర పెడుతుంటే
మనసు నన్ను వేధిస్తుంటే
ప్రేమకోసమై పరితపించాను
"ప్రేమ సుందరికై" తపించాను

ప్రేమ రెండు హృదయాలను
కలిపి బంధించు మమతాసూత్రం
గుండెలు రెండు ఒకటైపోవుటే నిజమైన ప్రేమకు
జీవం !!!

పో. & తాలూకా హుస్నాబాద్
జిల్లా : కరీంనగర్
పిన్‌కోడ్:505467 ఆం.ప్ర.

# వనదాత

రచన- కం. సత్యనారాయణమూర్తి

1 వచ్చితి, నొంటిగా భువికి, పాపము లెన్నియొ, జేసి, నేటికిన్
ఖచ్చితమైన, పంథ, కను గానక, రేబవలున్, నిరాశతో,
నచ్చిన నచ్చకున్న, చిరు-నవ్వు నటించుచు, నెన్నదేండ్లుగా
మచ్చిక జేసితిన్ దినము,— మానస హంసను, ముక్తి నీయగన్

2. కోరుట తప్పుగాదు, చెడు- కోరిక గూడ, దురాశయే యగున్
కోరుము సంఘసేవ, ప్రతి- కోరుట మానుము, కోరగల్గుచో
మీరకు మాట నొక్కపరి,- మీరిన నమ్మదు సంఘ మాపయిన్
దూరకు, సాటిసేవకుల,- దుర్బల వేదల, కాల్చి వేసెడిన్

3. నాతుది కోరికొక్కటి, య- నామక జీవుల, రాశి మధ్యలో
లోతుగ, దాగియుండి నను,- లోకులు యాడ్తురు, గాన, బుద్ధితో
యాతగ, రామనామమును,- నూరక బల్కిన, ముక్తిదాయకం
పోతన భక్తుడే పగిది- పోయెను, సర్వము వీడి జ్ఞానియై

4. చూచిన వెర్రికొందరికి,- చూపులు మాపులు, కంట కంబులున్,
చూచిన జాడ నేరకనె, జూతురు కాంచన కాంత నేలకో,
తోచదు పాప చిత్తునకు,- దోషము, యేలన, వాని కర్మయే,
నీచుని నంటగాల్చు, నది- నిక్కము, యాశకు నంతుగావలెన్

5. కన్నులు మందు నొక్కనికి- కాటికి జేరిన దాక, ద్వేషమా
తన్నుదహించు, శత్రువును- దాకదు, కావున నెయ్య మేఘడిన్
మిన్నగు, కయ్యముప్పు గద- మెందగు శాంతికి, చిత్తశుద్ధియే,
వన్నె సదా, నిదానము,కు- వాంఛలు ముక్తికి యడ్డుగోడలే.

6. చెట్టున బండు, కాయలను,— జెందెదు కుర్రలు రాళ్ళు వేసినన్,
బట్టున గోపగించదది, పండిన బండ్లను నిచ్చు, దాతగా,
గుట్టుగ నుండు, కీడునెన- గూర్చదు, యేలన, మానవాళికిన్
పుట్టుక నుండి పోషణకు- మూలము, జీవన దాతగావునన్

గుంటూరు.

# ఉపాధ్యాయుడు

రచన : సేనాపతి భాష్యకాచార్యులు

1. మానవాళికి సతతొక్క మార్గదర్శి
జ్ఞాన మెల్లర కందించు శారదాంబ
భావి పౌరుల దిద్దు సద్భావు కుండు
అందరికి గూర్చువాడు ఉపాధ్యాయుడిలను.

2. సంఘమందున శ్రేష్ఠమౌ స్థానమంది
సర్వజనులచే నుతులను చక్కగొనుచు
తనదు జీవమ్ము నాదర్శ వంతమనగ
అలరు చుండు ఘనుండుపాధ్యాయుడవని.

3. జ్ఞానదీపాలు వెల్గించి జగతిలోన
నజ్ఞతను బాపజాలెడు విజ్ఞుడితడు
తల్లిదండ్రుల కెనయైన స్థాన మంది
పూజ లందును గురుడెంత పుణ్యమూర్తి.

4. వట్టి గవ్వకుగాని బాల బాలికలను
కల్ప భూజాల్ సేయు శిల్పియతడు
శక్తి చేకూర నా శ్రమ బోధచేయగా
పలుగాథలను జెప్పు పండితుండు
విద్యార్థి విధులలో విరతుడై చరియింప
మంచి మార్గము జూపు మహిత మూర్తి
అజ్ఞాన మార్గాల నరయిక మెలగిన
శిష్యుని దిద్దెడు శీలమూర్తి.

విద్యవెంటను బోధించు వీరరసము
దేశభక్తిని కథలతో తెలియజెప్పి
బాలచంద్ర రుద్రమలుగా వరల జేసి
భావిపౌరుల నిర్మించు బ్రహ్మయతడు.

5 శాస్త్ర విజ్ఞానమ్ము చక్కగా సంధించి
పాఠాలు బోధించు వాడతండు
తను వహియించు జనులను బురికొల్పి
కర్మగతుల జేయు కార్మికుండు
నిద్రాజడులను నిర్నిద్రత లొనరింప
తట్టి మేల్కొల్పు వైతాళికుండు
చిన్నారి మనసులన్ క్షేత్రాల జ్ఞానమ్ము
హర్షానబండించు కర్షకుండు

ఇంజనీర్లుగ మంచెడి యింజనీరు
మంచి డాక్టర్ల మలచెడి మాన్యవరుడు
దేశవృద్ధికి వలసిన దీమంతులను
పుష్కలమ్ముగ నందించు బోధకుండు.

6. మంచి విద్యార్థుల మించ యెంచుకొనగ
సూటి ప్రతిభను జూపు గీటురాయి
ధర్మమ ధర్మాల వసరంగ వేర్పడ
ధర్మమ్ము దెలిపిన ధర్మమూర్తి
విద్యార్థి జనులకు వెలగట్ట లేనట్టి
సేవలనందించు సేవకుండు
విరివి ఛాత్రాళికి విజ్ఞానమనియెడు
పెద్ద నిధిని జూపు పితృసముడు

కరగు చన్నను కండలు, కంఠరవము
బిక్కు బిక్కన సేవల మిక్కిలిగను
చేసి దేశము నడిపించు చెన్నుమీర
అనుపమానుడై పరుగు నధ్యాపకుండు.

7. బహుపుస్తకమ్ముల పఠనమ్ము గావించి
విజ్ఞాన విశ్వమ్మె విరియుచుండు
దండించి తిట్టుచు తప్పులు జూపించి
సద్విద్య గ్రహియింప శ్రద్ధ బెంచు
పుస్తక విజ్ఞాన బోధలే కాకుండ
ప్రాపంచిక జ్ఞాన పటిమ నొసగు
ఆటపాటల తోడ ననువగు శారీర
దార్ఢ్యత సమకూర్చి తనరు చుండు.

హిందీ గణితము నాంగ్లము నింపుమీర
సంఘశాస్త్రమ్ము, తెలుగును సాంగతముగను
పెరుగు చున్నట్టి సైన్సులో తెరుగ జూపి
తనరు చుండును భువిని నధ్యాపకుండు.

8. వేద పండితుడు సర్వేపల్లి శ్రీ రాధ
కృష్ణ పండితుని సత్కీర్తి గాంచి
గురుడైన యట్టి ఠాగూరున కెనయైన
ప్రతినిధిత్వము గన్న ప్రాజ్ఞుడతడు
సత్యమహింసలు శాంతిని బోధించు
మాన్యమహాత్ముని మార్గగామి
విద్యార్థి వృద్ధియే విధియంచు నెంచుచు
పాటు పడునట్టి సత్ప్రధికుడతడు.
నేటి డాక్టర్ల, మంత్రుల దీటుగాను
దేశనాయకాదికులను తీర్చిదిద్ది
దేశవృద్ధికి, శుద్ధికి దివ్యతేజ
మిచ్చు బడిపంతులను మాట మెచ్చవలదే.

9. ఇచ్చు వేతన రాశినే మెచ్చుకొనుచు
తనదు సేవలో నిరతమ్ము తత్పరతను
శక్తిరక్తులతో గూడ చదువు గఱపి
తనరు చుండును భువినుపాధ్యాయుడెలమి॥

10. అతడు సర్వ విజ్ఞానాల కాలయమ్ము
సర్వరంగాల నైపుణ్య సంగతుడు
వేయియేల చెప్పగ దేశ విస్తరణకు
మూలమతడౌ చూడగా మూల్యమతడు.

ప్రథమశ్రేణి తెలుగు పండితుడు,
ప్రభుత్వోన్నత పాఠశాల, ఖలీల్‌వాడి,
నిజామాబాదు.

# కథాకోశంలోంచి భరద్వాజ

సి బి. కృష్ణ

ఒక కథను చదివిన తర్వాత మనసులో కల్లోలం ఏర్పడాలి. ఆ కల్లోలం ఒక సాంఘిక ప్రయోజనాన్ని సాధించేదిగా ఉండాలి. కథాలక్షణంతో కళాత్మకంగా కథని మలచాలి. కథావస్తువెంత ముఖ్యమో కథ నడిపే విధానమూ అంతే ముఖ్యం. ఈ అభిప్రాయాల్ని తనకథల్లో చూపించిన కథకుడు డాక్టర్ రావూరి భరద్వాజ.

"మిత్రుడు భరద్వాజ కొత్త ఎక్స్పోజిషన్‌ను వెతుక్కున్నారు. అది చలంగారు అనుకున్నది కాదు. ప్రగతి వాదులు అభ్యుదయ వాదులు అకాంక్షించేదీ, ఆకాంక్షించవలసిందీ," అని మహాకవి శ్రీశ్రీ, భరద్వాజ సామాన్యులను అర్థం చేసుకున్న అసామాన్యుడు, మనుషులను తెలుసుకున్న మనిషి" అభ్యుదయకవి డాక్టర్ దాశరథి, "వాస్తవాన్ని వాస్తవంగా చెప్పే కథకులెందరో ఉన్నారు తెలుగులో. వాస్తవంలోనే వాస్తవం చెప్పటం డాక్టర్ భరద్వాజకు బాగా తెలుసు" అని విమర్శకులు డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం అన్న మాటలు అక్షర సత్యాలు.

సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలకు చెందిన మౌలిక సత్యాలన్నింటినీ చాటిచెప్పే 'వర్గదృష్టి', ఒకే ఒక పదాన్ని ఎన్నివిధాలుగా వాడవచ్చునో అన్నివిధాలుగా వాడి, సృజనాత్మకంగా, కళాత్మకంగా తీర్చి దిద్దిన 'వాడేవీడు', నేటి సామాజిక అంశాలను పురాణ పాత్రలకు అన్వయించి రాసిన 'స్వార్థపరులు' తదితర కథలు రావూరి భరద్వాజ నిశిత పరిశీలనకు, శిల్ప విన్నాణానికి చక్కని నిదర్శనాలు.

పదహారు సంవత్సరాల పిన్నవయసులోనే అంటే 1943 లో తొలి వచన రచన చేశాడు భరద్వాజ. జానపద గాథలను జ్ఞప్తికి తెచ్చే ఈ కథలో శబ్దాడంబరమే ప్రధానంగా కనిపిస్తుంది 'ఆర్యావర్తన స్వర్ణ ముఖియను ద్వీపవతీ తటాంచలమున సుధానిధి 'యన బరుగు మహానగర మొండు గలదు. అందలి సౌధ సుధాప్రభలంబరచుంబితములు...." అంటూ ప్రారంభమై అసంపూర్ణమే అయినప్పటికీ-ఇప్పటికి దొరికిన వాటిల్లో మొట్టమొదటిదైన భరద్వాజ తొలి వచన రచన ఇదేనని విమర్శకులు భావిస్తున్నారు. భరద్వాజ తొలిరచన చదవాలనుకునే పాఠకుడికి ఈ కథ కొంత సంతృప్తిని కలిగిస్తుంది.

1943 తర్వాత అటోఇటో ఒక సంవత్సరం తేడాలో మరో పెద్దకథ రాశాడు భరద్వాజ. ఆ కథ పేరు 'వీరగాథ'. జానపదకథలా సాగిపోతుంది. ఒక రాకుమారుడు అరణ్యంలో తప్పిపోయి ఒక కోయ దొరకు దొరికిపోతాడు. అతడే పెరిగి పెద్దవాడై, కోయవారికి నాయకత్వం వహించి, ఆ దేశపు రాజు మీద తిరుగుబాటు చేస్తాడు-ఇదీ ఈ కథలోని ప్రధానాంశం. ముందు గ్రాంధికంలో రాసిన ఈ కథని సామాజిక ప్రయోజనంకోసం తిరిగి శిష్టవ్యవహారికంలో రచించాడు.

అపరాధ పరిశోధక నవలల పేరుతో మద్రాసులో 'హత్యాసాహిత్యం' విజృంభించిన రోజులవి. ఆ రోజుల్లోనే భరద్వాజ 'ఎత్తుపల్లాలు' అనే డిటెక్టివ్ కథ రాశాడు. చలం సాహిత్యంతోనే కాకుండా చలంతో

వ్యక్తిగత పరిచయం వున్న భరద్వాజ సెక్స్‌కథా రచయితగా తారాస్థాయి నందుకున్నాడు. 'కారుణ్యం' అనే కథలో "ఏ మహా తపో ఫలితమో జన్మించిన రాజేశ్వరి శరీరం వొంపుదగ్గర తుళ్ళిపడే ప్రవాహం లాంటి యవ్వనం, బుగ్గలు, ప్రకృతి ప్రసాదించిన మృదుసదన రసన, అన్నీ, అన్నీ నొక్కి అదిమి అనుభవిస్తున్నాడు గోపాలరావు అంటాడు.

భరద్వాజ సెక్స్ కథలు బాగా రాసే రోజుల్లోనే "భరద్వాజ నా వారసుడు" అన్నాడు చలం. "నీ సొంత గొంతుతో రచించు." అన్నారు మిత్రులు. ఆ మాటలే భరద్వాజను ఆలోచింప చేశాయి. ఆ ఊబిలో చనలనుండి తేరుకోవడానికి ఆయన కొన్నాళ్ళపాటు అజ్ఞాతరచయితగా ఉండిపోయాడు. ఆ తర్వాత 'సామాజికస్పృహ' రచనలకు 'కామా' పెట్టేసి 'సామాజిక స్పృహ' వైపు కలాన్ని పరుగులు తీయించాడు. సాంఘిక సమస్యలు ప్రతిబింబించే కథలు రాయడం ప్రారంభించాడు.

'విమల' అనేకథలో అర్థం పర్థంలేని వ్యర్థపు ఆచారాలన్నీ పక్కకుపెట్టి సంస్కరణ దృష్టితో ముచ్చటగా మూడునిముషాల్లో మూడుముళ్లు వేయించి సంస్కర్తలందరూ కలిసి నూతన దంపతులకు తేనీటి విందుఏర్పాటు చేస్తారు సాంప్రదాయానికి విరుద్ధంగా ఇలాచేయడం పల్లె సంఘ పెద్దలు సంస్కర్తలపై కత్తులు నూరారు. ఆనాటి సామాజిక పరిస్థితులే ఈ కథలో ప్రతిబింబిస్తున్నాయి. ఒక వ్యక్తియొక్క జీవిత విధానాలన్నీ అతని ఆర్థిక పరిస్థితితో ముడి పడివుంటాయి. ఆ స్థితి మారిన కొద్దీ ఆ విధానాలూ మారుతూవుంటాయి. ఈ మార్పులో సామాజిక, ఆర్థిక రాజకీయ రంగాలకు చెందిన అంశాలుంటాయి. ఆ అంశాలన్నింటినీ 'వర్గదృష్టి' అనే కథలో చక్కగా వ్యక్తం చేశారు.

సుమారు మూడు సంవత్సరాలు మద్రాసులో వుండి సినీ జీవితంలోని చీకటి గుయ్యారాలను స్వయంగా చూశాడు భరద్వాజ. సినీ మాయామోహిని జీవితాన్ని అక్షరబద్ధం చేయగా అది ఆయనకు అనంత కీర్తి ప్రతిష్ఠలను సంపాదించి పెట్టింది. అదే 'పాకుడు రాళ్ళు' నవల. ఈ నవలకు మూలం అనదగిన కథ 'పాల పుంత' ఈ కథను చదివిన ప్రతి పాఠకుడికి 'పాకుడు రాళ్ళు' నవల చదవాలనిపిస్తుంది.

మరో కథలో 'నాకు దేవుని చూడాలని వుంది' అంటాడు భరద్వాజ. దేవుని చూడాలని సుమారు ఐదే ళ్ళుగా ఆయన అనుకుంటూనే ఉన్నాడు కానీ ఒక్క సారికూడా చూడలేకపోయాడు. దేవుని చూడాలని వుండి కూడా చూడలేక పోవడానికి గల కారణాలే మిటో కథలో వివరించి చెబుతాడు.

భరద్వాజ దేవుని చూడాలనుకున్న రోజునే ఆకాశ మంతా వాన మబ్బులతో నిండి పెద్ద వర్షం కురిసింది. నూ జీడిలంటే ఇష్టపడే భరద్వాజ నూజీడీలు అమ్మే మునెమ్మవ్వను చూడడానికి బయలుదేరాడు. మునెమ్మవ్వ సరుకులన్నీ తడిసి పోయాయి. వాటి కేసి చూస్తూ, ఏడుస్తూ చలికి వణికిపోతూ కూర్చుంది మునెమ్మవ్వ. ఆ పరిస్థితుల నుంచి రక్షించడానికి ఆమెను తన ఇంటికి తీసుకెళతాడు భరద్వాజ.. అప్ప టికే బాగా పొద్దుపోతుంది. భరద్వాజను దేవుని దగ్గ రకు తీసుకేళ్ళాలనుకున్న మిత్రులందరూ వెళ్ళిపోతారు. ఆ విధంగా దేవుని చూడాలనుకున్న ఆయన తొలి ప్రయత్నం విఫలమైంది. ఆ తర్వాత తాను దేవుని చూడలేకపోవడానికి గల కారణాలు మరికొన్ని చెబు తాడు.

"పుణ్యపురుషులు చక్రవర్తులై అనుభవించే అష్ట ఐశ్వర్యాలనూ కోరను. మోక్షం నాకొద్దు, నా కోరిక ఒక్కటే- లోకంలోని దుఃఖ పీడితులందరి హృద యాల్లో నేనుఉండి, వారి బాధలన్నీ నేను అనుభవించి అయినా సరే— వారి దుఃఖాన్ని పోగొట్టాలి. అందుకే నాకు దేవుని చూడాలనివుంది" అని తన అభి ప్రాయాన్ని సూటిగా వ్యక్తం చేశాడు.

కథలు రచించడంలో ఒక కొత్త ప్రయోగం చేశాడు భరద్వాజ. ఒక పదానికున్న నానార్థాలను తీసుకొని వాటికి అనుగుణంగా కథను అల్లడమే ఆ కథల్లోని విశేషం. 'అవంత' 'పుట్టి' 'తేనీరు' అన్న కథలు ఇందుకు నిదర్శనాలుగా చెప్పవచ్చు ఆకాశవాణిలో అప్పుడప్పుడు వినిపించే 'ప్రకటించిన కార్యక్రమానికి బదులు' అన్న ఒక ప్రకటన చుట్టూ నిత్యజీవితంలోని ఎన్నో సంఘటనలను చిత్రించాడు. 'ఆమె కథ-కాదు కళ్లకథ-కాదుకాదు-ఆ కళ్ళ కథ' అనే కథ భరద్వాజ కథాకథన శిల్పవిన్నాణానికి ఒక ఉదాహరణ. ఆచితూచి అక్షరాలు వాడటం, ఎంతో అవసరమైతేతప్ప ఇతరభాషా పదాలు వాడకపోవడం ఆయన కథల్లో మనం గమనించవచ్చు.

'కథానాయకుడు దొరికాడు ఇక కథ దొరకాలి' కథలోని శిల్పవిన్నాణం పాఠకుణ్ని మంత్రముగ్ధుణ్ని చేస్తుంది. అన్ని ప్రేమకథల్లో మాదిరిగానే ఈ కథలో కూడా ఒక అబ్బాయి, అమ్మాయి ప్రేమించుకుంటారు. కొంతకాలం తర్వాత అబ్బాయి అమ్మాయిని మోసం చేసి వెళ్ళిపోతాడు. ఆ అమ్మాయికో కొడుకు పుడుతాడు. ఆ కొడుకే ఈ కథలో నాయకుడు. అతని కోపతాపాలు, ఇష్టాఇష్టాలు, సుఖదుఃఖాలు రచయిత మనకు చెబుతున్నాడనుకుంటాం. కానీ అలా చెబుతూనే కథానాయకుని అంతరంగాన్నీ, ఆ అంతరంగం అడుగున దాగి ఉన్న చేదు అనుభవాలను విశదపరుస్తాడు.

'ఈ సారి కిలాపోసింది' అనే కథలో భరద్వాజ నవలల్లోని రెండు పాత్రలు కనిపిస్తాయి. 'పాకుడురాళ్ళు' నవలలోని 'మంజరిపాత్ర' 'కాదంబరి' నవలలోని 'కౌముది' పాత్ర. ఈ రెండు పాత్రలు రచయితను కలుసుకొని, ఆ నవలల్లో తమ నెందుకలా చిత్రించిందీ చెప్పమనీ ప్రశ్నిస్తాయి. ఆ పాత్రలడిగిన ప్రశ్నలన్నింటికీ రచయిత సమాధానాలిస్తాడు. 'పాకుడురాళ్ళు' 'కాదంబరి' నవలలపై వివిధ పత్రికలలో వచ్చిన వ్యాసాలను దృష్టిలో పెట్టుకొని భరద్వాజ ఈ కథ రాశాడు. ఆయా వ్యాసాలలో వెలిబుచ్చిన సందేహాలన్నింటికీ ఈ కథలో సమాధానాలు దొరుకుతాయి. కథాసాహిత్యంలో ఇదొక నూతన పద్ధతి.

'ఒక చీమ కథ'లో సామాజిక చైతన్యం ప్రతిబింబిస్తుంది. స్వార్థంతో మనిషి తనను తానే మోసం చేసుకుంటున్నాడు. తనదికాని దానికోసం అల్లల్లాడిపోవడమన్నది జీవలక్షణమై పోయిందని ఈ కథ నిరూపిస్తుంది. "చీమా చీమా పిల్లవాణ్ని ఎందుకు కుట్టావూ" అని ప్రశ్నిస్తే "నాకతని మీద కోపంలేదు, ద్వేషం లేదు. నా శ్రమను కాపాడుకోవడానికి నేనుచేసిన ప్రయత్నమిది. మీ వాళ్ళను కూడా ఇలానే చెయ్యమని చెప్పండి" అంటుంది.

వర్తమాన, సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలను ప్రతిబింబించే కథ "ఒక దోమ కథ" సంపద యావత్తు కొందరి చేతుల్లోనే ఉండటం వల్ల దేశంలో దారిద్ర్యం పెరిగిపోయిందని ఈ కథ తెలియ చేస్తుంది. పేదవారికి తిండిని ఎరగావేసి వారి శ్రమశక్తిని దోచుకునే వ్యవస్థకు ప్రతిబింబమే 'ఒక ఎలుక కథ' ఆర్థిక పరాధీనత ఉన్నంతకాలం 'స్వేచ్ఛ' అనే మాటకు అర్థం లేదని 'ఒక చిలుక కథ' నిరూపిస్తుంది. ఈ నాలుగు కథల్లో మానవీయ ప్రస్తుతాంశమే ప్రతిబింబిస్తుంది. స్వార్థం మానవుల చేత ఎలాంటి పనులు చేయిస్తుందో, వారిని ఎలా తయారు చేస్తుందో రచయిత చూపిన నిదర్శనాలు కథలకు ఒక విశిష్టతను చేకూర్చి పెట్టడమే కాక రచయిత ప్రతిభను ప్రదర్శించేవిగా ఉన్నాయి.

కథ గజిబిజిగా రాయకూడదు. గాలివాటుగా రాయకూడదు. సమస్యల్ని సమాజ పరంగా వీక్షించి, విశ్లేషించి, వివరించి రాయాలి. ఈ దృక్పథంలో రాసిన భరద్వాజ కథల్ని అనుకరించటం కష్టం. అనన్యసామాన్యమైన కథా సంవిధానంతో సాహిత్యంలో కథయొక్క స్థానాన్ని అంతెత్తున నిలబెట్టిన కొద్దిమంది రచయితల్లో రావూరి భరద్వాజ పేరుకూడా ఉంటుందంటే అతిశయోక్తికాదు.

ఇం. నెం. 12-11-1082/2
వారాసిగూడ,
సికింద్రాబాద్ 500861

# గురజాడపై జరిగిన, జరగవలసిన పరిశోధనలు

— మానేపల్లి

'కన్యాశుల్కం తరగని గని' అని ఆరుద్ర అన్నారు. గాని, ఆ మాట కొస్తే గురజాడ వారి ప్రతి రచనా తరగని గని అనిపిస్తుంది.

ఎన్నిసార్లు చదివినా కొత్త ఆలోచనలకూ, అర్థాలకూ, పరిశోధనావకాశాలకూ పాదువంటి రచనలు వారివి. కనుకనే ఆయన రచనలపై అంతటి పరిశోధనా, పరిశీలనా జరుగుతున్నది, ఇంకా జరుగుతుంది, జరగాలి కూడానూ.

గురజాడ రచనలపై ఇంతవరకూ వెలువడిన పరిశీలనా వ్యాసాల, వాదోపవాదాల, విమర్శనా గ్రంథాల పట్టికను సమగ్రంగా ఎవరయినా రూపొందించినట్టయితే- అది నూరు పేజీలకు తక్కువకాని గ్రంథం అవుతుందని నేను నిశ్చితంగా చెప్పగలను.

గురజాడపై జరిగిన, జరగవలసిన పరిశోధనల గురించి అవకాశం వున్నంత మేరకు వివరించడమే ఈ వ్యాసం లక్ష్యం. ఇది సమగ్రం కాదు. అట్టి ప్రయత్నానికి ప్రరోచనం మాత్రమే.

## I

## జరిగిన పరిశోధనలు

గురజాడ రచనలపై ఆయన సమకాలీనులు కొందరు పరిశీలనా వ్యాసాలు రాశారు. ముఖ్యంగా ఆయన 'కన్యాశుల్కం'పై. అనేకులు పుస్తక సమీక్ష రూపంలో, అభిప్రాయాల రూపంలో, గురజాడకు నేరుగా రాసిన లేఖల రూపంలో ఇవి మనకు సాక్షాత్కరిస్తాయి. కన్యాశుల్కం వెలువడుతూనే ఎంతో సంచలనాన్ని సృష్టించింది. వస్తువులో, రచనా విధానంలో, భాషలో- అవి పూర్వపు నాటకాలన్నింటికీ భిన్నంగా సాగిన రచన కావడమే అందుకు ప్రధాన కారణం.

వావిళ్ళ వారి వల్ల గురజాడ రచనలకు కొంతకీడు జరిగినా, గురజాడ రచనలకు ప్రప్రథమంగా అచ్చు వేసిన వారిలో వావిళ్ళ వారూ వున్నారు. వారు గురజాడ రచనలకు మద్రాసు నుండి ప్రచురించారు. అనంతరం విజయనగరంలోని 'రామానుజాచార్య విద్యాసమితి' వారు గురజాడ రచనలకు కొన్నింటిని అచ్చు వేశారు. గురజాడ అప్పారావు గారి పెద్ద కుమారుడు రామదాసు గారే 'ముత్యాలసరములు: చిన్న కథలు' అనే పుస్తకాన్ని (1929) అచ్చు వేశారు. వీరంతా గురజాడ రచనలపై ఎంతో కొంత పరిశీలనా వ్యాసాలు వ్రాసినవారే. అవి సంపాదకీయాల రూపంలో గ్రంథ పీఠికల రూపంలో వున్నాయి.

తెలుగుకవి లోకానికి మరింత విస్తృతంగా గురజాడను పరిచయం చేసిన వారిలో ముద్దుకృష్ణను తప్పక పేర్కొనాలి. ఆయన 20 వ శతాబ్ది ప్రారంభంలోని తెలుగు కవితలకు 'వైతాళికులు' అనే సంకలనం (1935) ద్వారా అత్యంత ప్రతిభావంతమైన రీతిలో పాఠకలోకానికి అందించారు. 'ముత్యాల సరములు' అచ్చు ప్రతులు అలభ్యంగా వున్న రోజులో,

ముద్దకృష్ణ అందించిన- దేశభక్తి, పెన్నిధి, మనిషి అనే మూడు కవితలూ గురజాడను యువతరం కవులకు పరిచయం చేశాయి. ఆయన వైతాళికులకు రాసిన పరిచయంలో గురజాడను ఇలా ప్రశంసించారు.

"వైతాళికులనే మేలుకొలిపినవాడు. మార్గదర్శి, మేధావి, ఈయన గీతాలలో గౌరవాశయాలు, నూతన స్వచ్ఛత, స్వేచ్ఛ, ప్రత్యేకత ఉన్నవి. కవిత్వాన్ని, కళగా గ్రహించకపోలేదు. కాని సంఘ సంస్కారానికి కొంత సాధనగా ఉపయోగించారు.... కవిత్వం పండితుల ప్రత్యేకనిధి కాకుండా అందరికీ పంచిపెట్టే మార్గాన్ని నిరూపించాడు. ముందు రాగలవారికి స్వేచ్ఛా పత్రం (మాగ్నకార్టా) సంపాదించాడు.'

ఇది సరియైన అంచనాయే. ఇంతకంటె కొంచెం ముందే (1933 లోనే) ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు 'గురజాడ వాల్మీకి' అని ఆధునిక తెలుగు కవిత్వానికి గురజాడ వారే ఆద్యులనే విషయాన్ని చాటి చెప్పారు.

1935 లోనే శ్రీశ్రీ గురజాడ ముత్యాలసరాలపై కవితా రీతులపై చాలా మంచి వ్యాసం రాసి ప్రకటించారు. అ దరిమిలా ఆయన గురజాడపై రాసిన వ్యాసాలన్నీ విశాలాంధ్ర వారు చిన్న పుస్తకంగా ప్రచురించారు.

అప్పటికి విజయనగర వాసియైన ఆచార్య రోణంకి అప్పలస్వామి గారు- బహుభాషా కోవిదులై, తులనాత్మక దృక్పథంతో గురజాడను పరిశీలించి ఆయన ఘనతను తరగతి గదుల్లో, సభా వేదికలపై చాటి చెప్పారు. టాగోర్ రచించిన 'జనగణమన'కంటే, గురజాడ వారి 'దేశభక్తి' గీతం ఎన్నో రెట్లు మిన్న అని పదే పదే ఉద్ఘాటించారు. టాగోర్ కంటె గురజాడ గొప్ప కవి అనే సత్యాన్ని కూడా వెల్లడించారు. (ఈ భావాలే శ్రీశ్రీ వ్యాసాల్లో ఒకటికి నాలుగు చోట్ల దొర్లాయి- చూ॥ శ్రీశ్రీ సాహిత్యం-రెండు; వచన విభాగం) రోణంకి వారు తెలుగులో గురజాడపై ఒక మంచి విమర్శనా వ్యాసం వ్రాశారు. ఇంగ్లీషులో మరో వ్యాసం రాశాడు పుత్తడిబొమ్మ పూర్ణమ్మను ఇంగ్లీషులోకి అనువదించాడు. అది ఇంగ్లీషు అధ్యాపకులకు రసవత్తరంగా చదివి వినిపించి కంటతడి తెప్పించారట !

సోమయాజులు వెంకట రామమూర్తి గారు కన్యాశుల్కంపై సుదీర్ఘమైన పరిశీలనా వ్యాసం రాసి 'భారతి'లో ప్రచురించారు. ఈ వ్యాసం 1940 జూన్ జులై, ఆగస్టు, సెప్టెంబరు సంచికల్లో అచ్చయింది. ఈ వ్యాసంలోని అనేక అంశాలు బంగోరె తమ 'మొట్టమొదటి కన్యాశుల్కం'లో ఉదహరించారు. గురజాడ నాటకకళను అతి ఆధునిక రీతులలో పరిశీలించిన ఈ వ్యాసం ఢిల్లీ ఆంధ్ర సంఘం వారు ప్రచురించిన గురజాడ సంస్మరణ సంచిక (1974)లో పూర్తిగా పునర్ముద్రణ పొందింది.

హాస్య రచయితగా ప్రసిద్ధి పొందిన రాజమండ్రి వాస్తవ్యులు భమిడిపాటి కామేశ్వరరావు గారు కన్యాశుల్కంపై సుదీర్ఘ వ్యాసాలు వ్రాసి ప్రచురించారు. ఇవి పునర్ముద్రింపబడటం అవసరం.

మూలకారణం ఏదైనా జరుక్ శాస్త్రి, రుక్కాయి- అనబడే జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు 1955 లో ఆంధ్రపత్రికలో 'కన్యాశుల్కం' గురజాడ రచించినది కాదు అనే దుమారం లేవదీసి- గురజాడపై అనేక పరిశీలనా వ్యాసాలు రచనకు దోహదం చేశారు ఈ సాహిత్య దుమారంలో పాల్గొని గురజాడపై పరిశోధనా వ్యాసాలు వ్రాసినవారు- ఎం.వి.జగన్నాథరావు, కొత్తపల్లి వీరభద్రరావు, నిడుదవోలు వేంకటరావు, వసంతరావు బ్రహ్మాజీరావు, గిడుగు వెంకట సీతాపతి, అవసరాల సూర్యారావు, ఆరుద్ర, గురజాడ రామదాసు, వంగోలు మునిసుబ్రహ్మణ్యం, గిడుగు వెంకట రామమూర్తి, భమిడిపాటి కామేశ్వరరావు,

యామిజాల పద్మనాభస్వామి, బిరుదు శ్రీరామమూర్తి వగైరాదులు. నిగ్గు తేలిపోయింది. గురజాడ కవి సూర్యుడికి పట్టిన గ్రహణం విడిచి మరింత జగజ్జేగీయమానంగా ప్రకాశించడం ప్రారంభించాడు. ఇటీవల (1986 సెప్టెంబరు) వెలువడిన 'గురజాడ గురుపీఠం' అనే ఆరుద్ర గారి గ్రంథం ప్రశస్తమయిందీ, ఆలోచనాత్మకమయిందీను.

1950 లలో విశాలాంధ్ర ప్రచురణాలయం వారు అవసరాల సూర్యారావు గారిచేత గురజాడ రచనలను పరిష్కరింపచేసి, అనువదింపించి సంపుటాలుగా ప్రచురించారు. కన్యాశుల్కం కాక వారు ప్రచురించినవి 8 సంపుటాలు. 1. వ్యాసచంద్రిక (వ్యాసాలు), 2. కొండుభట్టీయం-బిల్హణీయం (అసంపూర్ణ నాటకాలు) 3. మహాకవి డైరీలు (ఇంగ్లీషుకు అనువాదం), 4. మాటా-మంతీ-అపీ-ఇపీ (రచనా శకలాలు). 5. లేఖలు (ఇంగ్లీషుకు అనువాదం), 6. ముత్యాల సరాలు, (కవితలు), 7 అణిముత్యాలు (కథలు), 8. డిసెంట్ పత్రం (పరిశోధనా వ్యాసం). ఇందులో చివరిదైన డిసెంట్ పత్రాన్ని పోరంకి దక్షిణామూర్తి గారు అనువదించారు. తక్కిన ఏడు సంపుటాలు వెలువరించడానికి అవసరాల సూర్యారావు గారు తీసుకున్న శ్రమ అంతా యింతా కాదు. ఈ శ్రమ ఎటువంటిదో ఇటీవల ఒక సభలో (జూన్ 20, విజయనగరం) ఆచార్య ద్రోణంకి అప్పలస్వామి గారు వివరించారు. ఆ రోజుల్లో అవసరాల సూర్యారావు గారు అంత శ్రమ తీసుకుని వుండకపోతే గురజాడ రచనల్లో అధిక భాగం మనకు లభ్యమయ్యే వుండేవి కావు. (ఇందుకు అవసరాల సూర్యారావు పట్ల కృతజ్ఞత ప్రకటిస్తూ గురజాడరామదాసు గారు ఈ వ్యాస రచయితతో 1963-64 ప్రాంతాల్లో అనేకసార్లు మాట్లాడారు). ఈ గ్రంథాల లోని లోపాలపై 1976 లో ఆంధ్రజ్యోతి దినపత్రిక పురాణం సుబ్రహ్మణ్యశర్మ గారు బహు విపులంగా 17 వ్యాసాలు ప్రచురించారు.

సెట్టి ఈశ్వరరావు గారు గురజాడ రచనలపై దాదాపు సమగ్రమైన పరిశీలన చేసి ఒక పుస్తకమే ప్రచురించారు. కె.వి.రమణారెడ్డి గారు కూడ గురజాడపై ఒక విమర్శనా గ్రంథాన్ని ప్రచురించారు. దీన్ని వీరు మరికొంతకాలం తరువాత- మరింత సమగ్రమైన పరిశోధన చేసి 'మహోదయం' అనే పేర బృహత్ గ్రంథంగా (1969) ప్రచురించారు. ఇది సుమారు 650 పేజీల గ్రంథం. ఇంతవరకూ గురజాడపై వెలువడిన గ్రంథాలన్నింటిలోనూ సుదీర్ఘమైనది ఏ ఒక్క రచననో కాక గురజాడ రచనలన్నింటిపైనా పరిశోధక వ్యాసాలుండటమే గాక- గురజాడ జీవితంపై కూడా వెలుగు ప్రసరించిన గ్రంథం ఇది. ఆధునిక తెలుగు కవితకు గురజాడ చూపినదే నిజమైన అడుగుజాడ అనే నమ్మకంతో కె.ఎ.ఆర్. గారు "అడుగుజాడ గురజాడది" అనే కవితా సంకలనం కూడా వెలువరించి- తన అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా స్థాపించారు.

గురజాడ కన్యాశుల్కాన్ని రెండుసార్లు రచించాడనేది ఈనాడు సాహితీలోకానికి సుపరిచితమైన విషయం. 1969 కి పూర్వం ఇది కొద్దిమంది పరిశోధకులకు మాత్రమే తెలుసును. గురజాడ 1897 లో ప్రచురించిన తొలి కన్యాశుల్కం ప్రతిని సేకరించి విపులమైన పీఠికలతో, వివరణలతో ప్రచురించారు బంగోరె. (1969 మార్చి). కన్యాశుల్కంపై బంగోరె చేసిన ఈ పరిశోధన చాలా అపూర్వమైనవి. 1909లో వ్రాసిన కన్యాశుల్కాన్ని నార్ల వేంకటేశ్వరరావు గారు ఆంధ్రజ్యోతి వారపత్రికలో 1970 లలో ధారావాహికంగా ప్రచురించారు. కేంద్ర సాహిత్య అకాడెమీ వారి తరపున 'కన్యాశుల్కం' సంక్షిప్త ప్రతిని కూడా రూపొందించారు. అంతేకాక గురజాడపై ఆంగ్లంలో ఒక గ్రంథం కూడా వ్రాసి ప్రచురించారు నార్లవారు. గురజాడపై ఆంగ్లంలో గ్రంథరచన చేసిన వారిలో పేటి సూర్యనారాయణశాస్త్రి గార్ని కూడా పేర్కొనవలసి వున్నది.

సర్దేశాయి తిరుమలరావు గారు కన్యాశుల్కంపై ఒక పరిశోధనా గ్రంథాన్ని ప్రచురించారు. ఈ గ్రంథంలో రచనా కాలం, పాత్రలు, నాటక రచనా రీతులు, ఇతివృత్తాలు, రసం- ఇత్యాది అనేక అంశాలు విపులంగా చర్చించబడినాయి. కన్యాశుల్కం ప్రాశస్త్యాన్ని శంకిస్తూ 1978-79 లో 'భారతి'లో కొంత రగడ సాగింది. విమర్శకునికి సర్దేశాయి తిరుమలరావు గారు గట్టి సమాధానమే చెప్పారు.

జే.వి. సోమయాజులుగారూ వారి మిత్రబృందమూ కన్యాశుల్కాన్ని 25 సంవత్సరాలుగా ప్రదర్శించి, ఆ నాటక సమాజపు రజతోత్సవ సందర్భంలో ఒక ప్రత్యేక సంచికను వెలువరించారు. అందులో మంచి పరిశీలనా వ్యాసాలున్నాయి. గురజాడపై అనేకమంది ప్రత్యేక సంచికలు ప్రచురించారు- తెలుగులోనూ ఇంగ్లీషులోనూ కూడా.

డా॥ సి. నారాయణరెడ్డి గారు ఆధునికాంధ్ర సాహిత్యంపై వెలువరించిన తమ పరిశోధన గ్రంథంలో గురజాడతో పాటు రాయప్రోలు వార్ని కూడా యుగకవిగా నిరూపించే ప్రయత్నంచేయడం అసమంజసం. విద్యార్థులు పొరపాటు అభిప్రాయాల్ని ఏర్పరచుకునే అవకాశం ఈ గ్రంథం కల్పిస్తుంది.

తెలుగు కవితా విప్లవాలపై డా॥ వెల్చేరు నారాయణరావు గారి గ్రంథం- గురజాడ కవితా రీతుల్ని శాస్త్రీయంగా చిత్రించింది. గురజాడ ప్రాశస్త్యాన్ని నిర్ద్వంద్వంగా స్థాపించింది. గురజాడపై ఆరుద్ర రాసిన 20 వ్యాసాలూ ఇటీవల ఒక సమగ్ర గ్రంథం రూపం దాల్చాయి.

చివరగా- నేను గురజాడపై చేసిన కృషిని వివరించడం అవసరం. దోణంకి అప్పలస్వామి గారి ప్రభావం, గురజాడ రామదాసు గారితో ప్రత్యక్ష పరిచయంవల్ల- గురజాడను కొంతవరకూ సక్రమ మార్గాన అర్థం చేసుకోవడం జరిగింది. 1968 లో విద్యార్థి దశలో- ఒక వ్యాసం వ్రాసి ప్రచురించాను. 1977 లో "గురజాడ నాడు-నేడు" సుదీర్ఘ వ్యాసం ఆంధ్రజ్యోతి దినపత్రిక- ఆదివారం అనుబంధంలో ప్రచురించాను. 1976 అవసరాల సూర్యారావు గురజాడ రచనలలో ఫోర్జరీలు చేసినట్లు ఆరోపిస్తూ ఆంధ్రజ్యోతి దినపత్రికలో వచ్చిన వ్యాస పరంపరలపై చర్చలో పాల్గొని- సూర్యారావు గార్ని బలపరుస్తూ సంపాదకీయ లేఖలను వ్రాశాను.

ఇటీవల 1986 జనవరిలో 'గురజాడ లేఖలు' అనే అంశంపై ఆకాశవాణి (విశాఖపట్నం కేంద్రం నుండి) ప్రసంగించాను. 17-1-1986 రాత్రి 8 గం॥కు ప్రసారమైంది. ఇది మరింత సమగ్రరూపంలో అచ్చు కానున్నది. గురజాడపై మరికొన్ని వ్యాసాలు త్వరలో వెలుగు చూడనున్నాయి.

అన్నట్టు- శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు గురజాడ వారిపై బహు చక్కని వ్యాసం రాశారు. మద్రాసు విశ్వవిద్యాలయానికి చెందిన డా॥ గంధం అప్పారావు గారు గురజాడపై కొన్ని వ్యాసాలు ప్రచురించారు.

పై వివరించిన పెద్దల రచనలే గాక, ఆంధ్ర- శ్రీ వెంకటేశ్వర, ఉస్మానియా, మద్రాసు వగైరా అనేక విశ్వవిద్యాలయాలకు చెందిన పరిశోధక విద్యార్థులు గురజాడపై అనేక పరిశోధక వ్యాసాలు సమర్పించారు. ఇందులో కొన్ని ప్రచురితమయ్యాయి.

ముందే మనవి చేసినట్లు, ఈ వ్యాసం సమగ్రమైనది కాదు. అందుకు చిత్తశుద్ధితో చేసిన చిన్న ప్రయత్నం మాత్రమే.

ఇప్పుడిక- గురజాడపై జరగవలసిన పరిశోధనల గురించి వివరిస్తాను.

## II

## జరగవలసిన పరిశోధనలు

ఎంత పరిశోధించినా గురజాడవారిపై ఇంకా పరిశోధించవలసిన అంశాలు మిగిలి పోతూనే వుంటాయి.

అందుకే ఆయన రచనలు తరగని గనులవంటి వని. ఎన్ని దశాబ్దాలు, శతాబ్దాలు గడిచినా అందు లోంచి జాతిరత్నాలవంటి పరిశోధక వ్యాసాలు, నూత నాంశాలు పుట్టుకొస్తూనే వుంటాయి.

కాలం గడిచిన కొద్దీ విలువపెరిగే రచనలు ఆయ నవి.

షేక్స్ప్రియర్ రచనలు- సుమారు నాలుగు వందలు సంవత్సరాలు గడిచినా- మరింత విలువైనవిగా తలచ బడుతున్నాయి. ఆయన రచనలపై దాదాపు అన్ని ప్రపంచ భాషలలో పరిశోధక వ్యాసాలూ, అను వాదాలూ వెలువడుతూనే వున్నాయి. షేక్స్ప్రియర్ నాటక కళపై అత్యాధునికమైన పరిశోధనలు, ప్రయో గాలు జరుగుతూనే వున్నాయి. ఆయన 36 నాటకాలు, మరికొన్ని కవితల్నూ రాశారు. అంటే నాటకం, కవిత్వం అనే రెండు ప్రక్రియలలోనే రచనలు చేయగా, గుర జాడ వారు అదనంగా కథలు, వ్యాసాలు, డైరీలు వ్రాశారు. ఇవి మరింత ఆధునిక ప్రక్రియలు గనుక, మరిన్ని పరిశోధనలు చేయవచ్చును.

## రచనల వర్గీకరణ, పరిష్కరణ

గురజాడ రచనలకు మొట్టమొదటిసారిగా సమ గ్రంగా తెలుగు పాఠకలోకానికి అందించిన అవసరాల సూర్యారావు గారు మొత్తం రచనలను 6సంపుటాలుగ వేశారు. ఏ దృష్టితో చూసినా ఈ వర్గీకరణ లోపభూ యిష్టమే. ఒక సంపుటిలో చేరవలసిన రచనలు మరో సంపుటిలో కనపడటం తరచుగా జరుగుతూవుంటుంది.

"ఆధునిక గద్య వాఙ్మయ ప్రవర్తకుడు" అనే వ్యాసంలో శ్రీశ్రీ గురజాడ రచనల్ని ఇలా విభా గించారు.

1. నాటకీయం
2. కథనాత్మకం
3. విమర్శనాత్మకం
4. వ్యక్తిగతం.

పై విభాగంలో పద్య రచన/కవితలకు వేరే కేటా యింపు లేదు. వారి కవితారచనలో ఏవి ఏ విభాగంలో కిందకు వస్తే ఆ విభాగం కిందకు చేర్చాలి. ఇది కొంచెం ఇబ్బందికరమైన విభాగమే.

ప్రస్తుతం సెట్టి ఈశ్వరరావు గారు గురజాడ రచనల్ని పునః పరిష్కరించి సంపుటాలుగా వెలు వరించే కృషి చేస్తున్నారు. ఇప్పటికి కథానికలు ఒక సంపుటంగానూ. కథలు మరో సంపుటం గానూ (విశా లాంధ్ర ప్రచురణాలయం) వెలువరించారు. ఈ సంపు టాలలో వీరు చేపట్టిన వర్గీకరణ విధానం సమంజసం గానే వున్నది. ముత్యాలసరాలనే గాక, గేయాలనూ, కీర్తనలనూ, ప్రాచీన ఛందస్సులో వ్రాసిన ఖండిక లనూ- ఒకే సంపుటంలో చేర్చారు. కథలున్న సంపు టంలో- ఒక నవలకు స్థూలరూపంగా వారు వ్రాసిన 'సౌదామిని' అనే రచనా శకలాన్ని (పెద్ద కథ ?) చేర్చడం ఉచితంగానే వున్నది. ఈ వరుసలో ముందు ముందు వెలువడే సంపుటాల్ని కూడా చూడవలసి వున్నది.

కన్యాశుల్కం ఒక్కటే ఒక్క సంపుటంగా తీసుకురావొచ్చు.

కొండుభట్టీయం-బిల్హణీయం- చిత్రాంగి- మొద లైన అసంపూర్ణ నాటకాలను మరొక సంపుటంగా వెలువరించవచ్చు.

ఇంతవరకూ ఫరవాలేదు.

ఆ పైన చిక్కు వస్తుంది.

కారణం- గురజాడ వారి తదితర రచనలు తెలుగులో లేవు. డైరీలు, లేఖలు వగైరా పూర్తిగా ఇంగ్లీషు లోనే వున్నాయి. డిసెంట్ పత్రం సరేసరి. ఆయా రచనల్ని గ్రంథపాఠాలు లేకుండా మరింత

జాగ్రత్తతో పరిష్కరించవలసి వున్నవి. ఇందుకు గురజాడ హృదయాన్ని బాగా తెలుసుకోగల రోణంకి అప్పలస్వామి, కె వి.రమణారెడ్డి, ఆరుద్ర వంటివారు పూనుకోవాలి. (వృద్ధాప్యం పైబడిన రోణంకి వారు వ్రాయలేరు. చెప్పగలరు.) ఈ పని జరగనిదే వర్గీకరణకు పూనుకోవడం అసమంజసమే కాదు, ప్రమాదభరితంకూడానూ.

గురజాడ బహుకొలది రచనలు చెయ్యలేదు గనుక వర్గీకరణకు నేనొక సూక్ష్మమార్గం సూచించదలచుకున్నాను.

1 కవిత- ముత్యాలసరాలు, నీలగిరి పాటలు, సుభద్రా పరిణయం వగైరా-

2 వచనరచన- కథలు, వ్యాసాలు, డైరీలు లేఖలు, డిసెంట్ పత్రం

3 నాటకాలు- కన్యాశుల్కం, అసంపూర్ణ నాటకాలైన కొండుభట్టీయం, బిల్హణీయ, చిత్రాంగి.

మొదటి సంపుటం కొంచెం చిన్నది వుంటుంది గనుక గురజాడ జీవితము సాహిత్య కృషికి సంబంధించిన సమగ్ర వ్యాసం దీనితో చేర్చవచ్చును. ఈ వ్యాసంతో పాటు గురజాడ వారి జన్మస్థలం, ఎరయి నగరం... చిత్రాలు వగైరాలు ఫోటోలు చేర్చితీరాలి. రెండవ సంపుటంలో గురజాడ చిత్రాలు, గురజాడ దస్తూరి మొదలైన ఫోటోలు తీర్చాలి. మూడవ సంపుటంలో కన్యాశుల్కం నాటి రంగస్థలం, వీలయితే ఆనాటి ప్రదర్శనలు, నటులు తదనంతర నటులు, సినీమాగా వచ్చిన 'కన్యాశుల్కం'లోని ఫోటోలు వుండితీరాలి. ఫోటోలు లేనిదే ఈ సంపుటాలు సమగ్రం కానేరవు.

## ఆంగ్లరచనలు

సరిగ్గా ఒక శతాబ్దం క్రితంనాడు (1886లో) గురజాడ ఆంగ్లరచనలే చేసేవారు తెలుగు రచయితగా పరిణమించాలనే భావం ఆయనకు అంతగా ఉన్నట్టు కనబడదు. 1882లో వెలువడిన 'కుక్క' అనే పద్యం, 1883లో వెలువడిన 'సారంగధర' పద్యకావ్యం 'చంద్రహాస' పద్యకావ్యం మరికొన్ని కవితలు ఇంగ్లీషులోనే వున్నాయి. ఈనాడు మనం తెలుగులో 'సంస్కర్త హృదయం' అనే కథ చదువుకున్నాం. దీన్ని మొదట గురుజాడవారు ఇంగ్లీషులో "Stooping to Raise" అనే పేరుతో రాశారు, ఇది ఎక్కడా అచ్చయినట్టు లేదు.

కన్యాశుల్క నాటకం రెండు ముద్రణలకూ ఇంగ్లీషులోనే పీఠికలు రాశారు శ్రీరామవిజయ వ్యామోహ (?) అనే నాటకానికి ఇంగ్లీషులో సుదీర్ఘమైన ఉపోద్ఘాతం రాశారు. గోమఠం శ్రీనివాసాచార్యులు గారి 'హరిశ్చంద్ర' నాటకానికి ఇంగ్లీషులో పీఠిక రాశారు. ఇక ఆయన రాసిన పరిశోధక వ్యాసాలూ, డిసెంట్ పత్రమూ, డైరీలూ యింగ్లీషులోనే వున్నాయి ఇవి కాక లేఖలు సరి. ఇవి అన్నీ ఒక దగ్గర పెట్టి చూస్తే చిన్నా పెద్దా నాలుగు సంపుటాలు తప్పక అవుతాయని తోస్తుంది. అంటే గురజాడ తెలుగులో ఎంత రచన చేశారో, ఇంగ్లీషులోనూ అంత రచనా చేశారు. గురజాడ ఇంగ్లీషు రచనలు యథాతథంగా అచ్చయితే వారి హృదయం", ఆలోచనా ధార మరింత స్పష్టంగా ఆవిష్కరింపబడుతుంది.

## రూపము, వ్యక్తిత్వము

గురజాడవారి భౌతికమైన రూపురేఖలకు కూడా ఇప్పుడు ఇబ్బందులు వస్తున్నట్టు కనపడుతుంది. విశాఖపట్నంలో ఆర్ టీ సీ కాంప్లెక్స్ సమీపంలోని నాలుగురోడ్ల కూడలిలో వున్న విగ్రహం ఒక్కటే గురజాడవారి భౌతికరూపాన్ని నిర్దుష్టంగా వెల్లడిస్తున్నది. చేతిలో పుస్తకం పట్టుకొని సోఫావంటి విశాలమైన కుర్చీలో కూర్చుని వున్నట్టున్నదీ రూపం. నిజానికి ఇటువంటి ఛాయాచిత్రం ఏదీ లేదు. గురజాడ వారి చిత్రాలన్నిటినీ బహుజాగ్రత్తగా అధ్యయనం

చేసి- ప్రముఖ చిత్రకారులు అయ్యాకుల పైడిరాజు గారు దీన్ని కల్పించారు. (ఈ శిల్పం తయారవడం- మొదటినుంచి చివరి వరకూ నాకు తెలుసును) విజయ నగరం మహారాజువారి కళాశాల వద్ద ఒకటీ- గుర జాడ జన్మస్థానమైన సర్వసిద్ధరాయవరం (విశాఖ జిల్లా)లో మరొకటి విగ్రహాలున్నాయి. (వాట్ని నేను చూశాను). వీటిలో గురజాడ పోలికలు తక్కువ. తల పాగ, మీసం- ఇవే గురజాడ ముఖ్యలక్షణాలు అనే కాడికి దిగింది వ్యవహారం. చూడగా- ముందు ముందు గురజాడ వారి రూపం మరింత వికృతంగా మారు తుందో అనేభయం వేస్తుంది. డైరీల్లోనూ, తదితర రచనల్లోనూ జాగ్రత్తగా పరిశీలిస్తే గురజాడ భౌతిక రూపానికి సంబంధించిన వివరాలు దొరుకుతాయి. ఎత్తు, బరువు, శరీర పరిమాణం వగైరాల గురించి ఆయనే రికార్డు చేసుకున్నారు. దుస్తులవర్ణన కూడా వుంది.

గురజాడ ఛాయాచిత్రాలన్నీ సేకరించాలి. వాటిని కాలక్రమంలో అమర్చాలి. అలాగే గురజాడ తెలుగు, ఇంగ్లీషు దస్తూరీలను కూడా పదిలపరచాలి.

ఇక గురజాడ వ్యక్తిత్వము- అనగా అంతరంగిక గుణగణాలు, అభిరుచులు, అయిష్టాలు, సంభాషణా రీతి, కార్యదక్షత, పరిశీలనా దృష్టి, వ్యక్తిగత స్వభావం, ఇతరులపట్ల వ్యవహరించే తీరు, ప్రజాహిత జీవితం, ఉద్యోగిగా గురజాడ, ఉపాధ్యాయుడుగా, రచయితగా, శాసన పరిశోధకుడిగా గురజాడ, వక్తగా గురజాడ (?)- ఇవన్నీ సమగ్రంగా పరిశోధించి సేక రించాలి. నాటకం పట్ల ఆయనకుగల దృక్పథం, ఆయన ఎన్నడైనా నాటకాలకు ప్రయోక్తగా, దర్శ కునిగా వ్యవహరించారా? ఆయనలోని ఉత్తమ ప్రేక్ష కుడు, విమర్శకుడు- ఇవికూడా పరిశీలించాలి.

బాల్యం, విద్యాభ్యాసం, తల్లిదండ్రుల పట్ల అన్న దమ్ములపట్ల ఆయనకు గలభావాలు, దాంపత్య జీవితం భార్యపట్ల ఆయన దృక్పథం, సంతానం- వ్యక్తిగత ఆరోగ్యం- ఇవీ పరిశీలించ తగినవే. వీటి ప్రభావం ఆయన వ్యక్తిత్వంపై తప్పక వుంటుంది. ఇవి కొట్టి పారెయ్యవలసిన వివరాలుకావు.

పై విషయాలన్నీ తెలిస్తే- ఆయన అనేక రచ నల్ని అసమగ్రంగా ఎందుకు వదలవలసి వచ్చిందో తెలుస్తుంది.

## సమకాలికపరిస్థితులు, వ్యక్తులు

గురజాడ రచనలపై జరిగినంత పరిశోధన ఆయన సమకాలిక పరిస్థితులపై జరిగినట్టు లేదు సమీప గతంపై కూడా పరిశీలన జరగవలసివుంది.

గురజాడ కాలం నాటి ఆంధ్రదేశం, ప్రపంచం- ఆ కాలంనాటి ప్రజలు, వర్ణవ్యవస్థ, ఆర్థిక వ్యవస్థ, పాలకవర్గం, విద్యావిధానం, వివాహ వ్యవస్థ, స్త్రీలు భోగంస్త్రీలు, ఉన్నత కులాలకు అట్టడుగు వర్గానికి చెందిన స్త్రీలు; మతం- కళలు- రాజకీయాలు; కరువు నాటకాలు, ప్రణయం సాధనాలు. ఆహార పనపిణీ, వ్యాపారం; అప్పటి అచ్చుయంత్రాలు, ప్రచురణ కర్తలు, పత్రికలు, సాహిత్య సంఘాలు వీటిపై ఆంగ్లే యుల ప్రభావం... ఇలా ఎన్నెన్నో అంశాలు పరిశో ధించవలసి వున్నాయి. పైనుదహరించిన ఒక్కొక్క పదం ఒక్కొక్క పరిశోధన గ్రంథానికి విషయం సమకూర్చగలదు.

గురజాడ సమకాలికులు, ఆయన మిత్రులు, ఇతర రాష్ట్రాల్లో జరుగుతున్న కృషి. సమకాలిక పరిస్థితుల పట్ల సాహిత్యం పట్ల గురజాడ చూపిన ఆసక్తి... మళ్ళీ ఇదంతా మరో సముద్రం అంత విషయం.

'గురజాడ చేసిన ప్రయాణాలు' అనే వ్యాసం ఎవరయితే రాయదల్చుకుంటే బోలెడు గ్రంథం అవు తుంది. ప్రయాణ సౌకర్యాలు బహుతక్కువగా వుండే రోజుల్లోనే ఆయన ఆంధ్రదేశపు ఎల్లలుదాటి బెంగు ళూరు, మైసూరు, నీలగిరి, బరంపురం, కలకత్తా,

కాశీ వగైరాది ప్రాంతాలు పర్యటించారు. ఆయా ప్రాంతాల్లోని ప్రముఖులను కలుసుకున్నారు. ప్రజల్ని పరిశీలించారు. ఆయన బొత్తిగా 54 సం॥కు మరణించకపోతే, మరింత ఆరోగ్యంతో వుండివుంటే మహారాజావారివెంట తప్పక విదేశాలకు వెళ్లి వుండేవారు. మరింత సంస్కృత సంపదను తెలుగులోనికి దిగుమతి చేసేవారు (ఆయన ప్రయాణాలు అనే అంశంపై ఎంతగ్రంథం తయారవుతుందో తెలియచెయ్యడం కోసమే ఈ పేరా విస్తరించి ఉదహరించాను.)

ఆయనకు కొంచెం అటూఇటుగా సమకాలికులైన వారితో గురజాడను పోల్చిచూడటం ఎంతమంచి పరిశోధన కాగలదో ఆరుద్ర చేసి చూపించారు. పూరణసింగ్–గురజాడ; కుమారన్ ఆశాన్-గురజాడ అనే వ్యాసాలు పరిశీలించదగినవి, మరింత విపులీకరించ తగినవి కూడాను.

'కందుకూరి వీరేశలింగం–గురజాడ అప్పారావు' అనే అంశంపై పరిశోధన సాగిస్తే ఎన్నెన్నో అంశాలు వెలికి వస్తాయి, రెండు మూడు వందల పేజీలగ్రంథం తయారవుతుంది.

'గురజాడ ప్రజాహిత జీవితం' అనే అంశంపై పరిశోధిస్తే సాహిత్యవేత్తగానేకాక, అనేక సమకాలీన సమస్యలపై ఆయనచేసిన కృషి ఎటువంటిదో బోధపడుతుంది.

విజయనగర సంస్థానంలో గురజాడ, రాచరిక వ్యవస్థలో గురజాడ, బ్రిటిష్ పాలనాకాలంలో గురజాడ ఇలా ఒక్కొక్క అంశమూ ఒక్కొక్కగ్రంథమే అవుతుంది విపుల పరిశోధనలు సాగిస్తే.

## రచనలన్నింటిపై సమగ్ర పరిశీలన

కన్యాశుల్కంపై జరిగినంత పరిశోధన గురజాడ ఇతర రచనలపై జరగలేదనే చెప్పాలి. ఇందుకు కారణాలు లేకపోలేదు. నాటకం ఇతర ప్రక్రియలకంటే గొప్పది, ఒక కీలక సమస్యకు అద్దం పట్టాడాయన. రచనలో భాషా విషయంలో చూపిన విప్లవం–ఇవి కొన్ని కారణాలు మాత్రమే. కన్యాశుల్కం సరసన వుంచగల నాటకం ఇంకా తెలుగులో రావలసే వున్నదనే విషయం ఇప్పటికీ తిరుగులేని సత్యమే.

కన్యాశుల్కం తరువాత, చెప్పుకోదగిన పరిశోధన ఆయన కవితపై జరిగింది. కాని మరింత జరగవలసి వుంది. కథాకథన కావ్యాలు, కవితలలో కరుణరసం సంఘసంస్కరణ, కవితలలో ప్రతిబింబించిన స్త్రీ; దేశభక్తి, వ్యంగ్యం, కవితలలో కనిపించే సమకాలీన సంఘం, గురజాడ సంగీత పరిజ్ఞానం, గురజాడ కవితలో ప్రకృతి వర్ణన, గురజాడ బాలసాహిత్యం, గురజాడ కవితాశైలి, పదప్రయోగాలు, కవితలలో ప్రసిద్ధిపొందిన వాక్యాలు (దాదాపు సుభాషితాలుగా మారినవి); కవితలలో గురజాడ సందేశం....ఇలా కేవలం వారి కవితలపైనే అసంఖ్యాకమైన పరిశోధనా వ్యాసాలు వ్రాయవచ్చు. కొన్ని వ్యాసాలు దాదాపు ప్రత్యేక గ్రంథంగా కూడా తయారవుతాయి.

గురజాడ కథల మీద తగినంత జరగలేదనే చెప్పాలి. తెలుగుకథకు ఆయన నిస్సందేహంగా ఆద్యుడే. కాలక్రమంలో ఆయన కంటె ముందు ఆచంట సాంఖ్యాయన శర్మగారు కథలు రాశారని ఒకవాదం వున్నది. గ్రాంధికభాషలో రచించిన లఘు రచన ఒకటి ఇటీవల వెలికితీసి ఒక పరిశోధకుడు ప్రచురించడమూ జరిగింది (ఆ రచన–కథ–ఆంధ్ర జ్యోతిదినపత్రికలో 1979 జనవరిలో అచ్చుపడింది. ఆంధ్రవిశ్వవిద్యాలయానికి చెందిన ఆ పరిశోధక విద్యార్థి పేరు శ్రీ మస్తాన్). వచనంలో సాగిన లఘు రచన అనే చెప్పాలి తప్ప దాన్ని 'కథ' అనడం కుదరదని నా నిశ్చితాభిప్రాయం. కనుక ఆధునికార్థంలో చెప్పాలంటే మొట్టమొదట కథ రాసినవారు గురజాడవారే. గురజాడ కథలు–సమకాలిక సాహిత్యంలో కథలు; కథారచనారీతులు (ఆయన రచించిన

5 కథలు కథారచనలోని 5 రీతులకు ప్రతినిధులుగా చెప్పవచ్చు) పాత్రచిత్రణ; సంఘసంస్కరణ, గురజాడ కథల్లో మతవిషయాలు, గురజాడ కథల్లో స్త్రీ పాత్రలు; నాచే ప్రోబ్లమ్-ఇత్యాది అనేక సంగతులపై పరిశోధనా వ్యాసాలు వ్రాయవచ్చును.

గురజాడ తదితర రచనలైన వ్యాసాలు, లేఖలు, డైరీలు, రిసెంట్‌పత్రం మొదలైన వాటిపై వెలువడిన పరిశీలనా వ్యాసాలు బహుస్వల్పం.

'వ్యాసచంద్రిక' పేర అవసరాల సూర్యారావుగారు సంకలించిన పుస్తకం (నవంబర్ 1953)లోని వ్యాసాల్లో కొన్ని మహాకవి ఆంగ్లరచనలకు తెలుగు. ఇందులో 16 వ్యాసాలున్నాయి. మరికొన్ని వ్యాసాలున్నాయి. మరికొన్ని వ్యాసాలు 'మాటామంతీ' అనే సంపుటంలో వున్నాయి అవి ఇవీ: తిక్కన విరాట పర్వం, బిరుదులు-పూసపాటివారి బిరుదావళి, హరిశ్చంద్ర నాటిక పీఠిక, ఈ రచనలన్నింటినీ ఒకటికి రెండుసార్లు జాగ్రత్తగా చదివితే అనేక ప్రశ్నలుదయించి, అనేక పరిశోధనలకు అవకాశం కల్పిస్తాయి.

ప్రాచీన తెలుగు సాహిత్యంపై గురజాడ, ఇతర భాషా సాహిత్యాలపై గురజాడ, గురజాడ వంగ సాహిత్యము, భాష, వ్యాకరణాదులపై గురజాడ, వ్యవహారిక భాషపై ఆయనమక్కువ, విద్యావేత్తగా ఆయన అభిప్రాయాలు....ఇత్యాది వ్యాసాలు ఎన్నెయినా వ్రాయవచ్చును.

మాటామంతీలోని గురజాడ రచనా శకలాలను పరిశీలిస్తే వివిధవిషయాలపై ఆయనకుగల అభిప్రాయాలు మనకు సాకల్యంగా అర్థమవుతాయి. అవి ఆయన వ్యక్తిత్వంపై, తాత్త్వికధారపై వెలుగును ప్రసరిస్తాయి. ఆయన ఇంకా ఏయేరచనలు ఏయే విధంగా చేయాలని ఆలోచనలు చేసేవారో కూడా మనకు తెలుస్తుంది. కొన్ని రచనాశకలాలను చూడగా ఆయన మొక్క చరిత్రాత్మక దృష్టి, చరిత్రపై ఆయనకుగల మక్కువ సుబోధక మవుతాయి సత్యము పట్ల, సత్శీలముపట్ల వారికిగల గౌరవము దాదాపు అన్ని రచనలలోనుగా మనకు గోచరిస్తుంది. నవలా రచనకు వారు చేసిన ప్రయత్నంకూడా అవగతమవుతుంది.

మహాకవి లేఖలు, డైరీలు సాహిత్య పరిశోధకునికే కాక 20 శతాబ్దినాటి తెలుగుదేశ పరిస్థితులపై పరిశీలనచేసే ఏ వ్యక్తికైనా గనులవంటివనిపిస్తుంది. ప్రతిచిన్న విషయాన్నీ ఆయన ఎంత నిశితంగా పరిశీలించేవారో చూస్తే ఆశ్చర్యమవుతుంది. గురజాడ కాలంనాటి మదరాసు, విజయనగరం-లపై సుదీర్ఘమైన వ్యాసాలు వ్రాయవచ్చును.

ఇక-కన్యాశుల్కంపై జరగవలసిన పరిశోధన ఎంతయినా వుంది. కన్యాశుల్కం — రచనాశిల్పం పాత్రోచితభాష, విజయనగరం మాండలికం, ఆనాటి కోర్టువ్యవహారాలు-చట్టం, ఆ కాలంనాటి రంగస్థలం-నటులు-నాటక కళ-ఆహార్యకం, కన్యాశుల్కంలో కాలం, కన్యాశుల్కంలో కనపడిన నేషనల్ కాంగ్రెసు, కన్యాశుల్కంలో నాయకుడెవరు?, కన్యాశుల్కంలో స్త్రీపాత్రలు, కన్యాశుల్కంలో హాస్యం/వ్యంగ్యం; రససిద్ధాంతం—కన్యాశుల్కం; ఆ నాటకం సాధించిన సాంఘికప్రగతి, నాటకరంగంపై కన్యాశుల్కంప్రభావం, సాహిత్యరంగంలో కన్యాశుల్కం ప్రభావం; కన్యాశుల్కంలో కులవ్యవస్థ, వివాహ వ్యవస్థ; కన్యాశుల్కంలోని సూక్తులు, ప్రసిద్ధ వాక్యాలు; కన్యాశుల్కానికి అనుకరణలు... ఇలా ఎంతవ్రాసినా వుంది. ఒక్క కన్యాశుల్కమే తరగని గని.

ఇవిగాక—

గురజాడ చదివిన గ్రంథాలు, గురజాడపైప్రభావం చూపిన రచయితలు, రచయితలకు గురజాడ సలహాలు, మార్క్సిస్టు దృక్పథంలో ఆయన రచనలు ఆయనలోని హేతువాదభావాలు, శాస్త్రీయదృక్పథం,

గ్రంథరూపంలో వెలువడని గురజాడ రచనలు (కళింగదేశచరిత్ర వగైరా), గురజాడ ప్రచురణ కర్తలు, నేటికీ బెస్ట్‌సెల్లర్స్‌గా వుంటున్న గురజాడ రచనలు, గురజాడ కుటుంబం, ఆయన పూర్వీకులు, ఆయన తరువాతివారు, గురజాడపై తరతరాల ప్రముఖుల అభిప్రాయాలు, ఇతర భాషల్లో గురజాడ,ఇతర దేశాల్లో గురజాడ, గురజాడపై వెలువడిన డాక్యుమెంటరీ చిత్రాల పరిశీలన, గురజాడ మ్యూజియం-స్మృతిచిహ్నాలు....బహుశా ఈ జాబితాకు అంతం వుండదు ఈ వ్యాసం రాసే సమయానికి నా బుద్ధికి తోచిన అంశాలను మాత్రం రాశాను.

విజ్ఞులైన సాహితీ పరిశోధకులు ఈ అంశాలను కూలంకషంగా పరిశీలిస్తారనీ, ఆ మహామనీషి జాతికి యిచ్చిన సంపదను ఇతోధికంగా పెంపొందించుకుంటారనీ ఆశిస్తాను.

తెలుగు పండితుడు,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల,
నర్సీపట్నమ్, విశాఖపట్నం జిల్లా.

# జానపద గేయ సాహిత్యంలో సీత

కంచనగారి గంగాధరరెడ్డి

జనపథంలో ఉండేవాళ్ళు జానపదులు. జనపథమంటే పల్లెటూరు. పల్లెపట్టుల్లో ఉండేవాళ్ళు పల్లె ప్రజలు లేక జానపదులు. వాళ్ళు పాడుకొనే పాటలు పల్లెపదాలు లేక జానపద, గేయాలు. వీటినే ఇంగ్లీషులో Folk songs అంటారు. ఈ పదం Volk shied అనే జర్మన్ భాషాపదాని కనువాదమని బి. రామరాజు గారు తెల్పినారు [1] Folk songs (జానపదగేయాలు) Folk literature (జానపద సాహిత్యం) Folk lore (జానపత విజ్ఞానం) లేక (జానపదవాఙ్మయం) అనేవన్నీ ఒకే శబ్దం నుండి వచ్చినవే.

## జానపద గేయ స్థూల వర్గీకరణం

జానపద సాహిత్యంలో జానపద గేయమనేది ఒక ప్రత్యేకశాఖ. దీనికి జానపద సాహిత్యంలో విశిష్టమైన స్థానం ఉంది. "జానపద గేయము లన్నింటిని పురుషుల పాటలు, స్త్రీల పాటలు, స్త్రీ పురుషోభయ పాటలు, పిల్లల పాటలు అని నాలుగు విధములుగా విభజింపవచ్చును. అందు పురుషుల పాటలను, స్త్రీ పురుషోభయుల పాటలను, భావోద్వేగములు. ధార్మికములు, క్రియాన్వితములు. వినోద సంబంధము లని విభగడింపవచ్చును. స్త్రీల పాటలను లాలిపాటలు,జోల పాటలు, వేడుక పాటలు, భక్తి పాటలు, శ్రమజీవన పాటలు అని విభగడింపవచ్చునని జి.యస్ మోహన్ గారు తెల్పినారు.[2]

## జానపద గేయ సాహిత్యంలో సీత :

జానపద సాహిత్యం ముందు తేల్పినట్లుగా అనేక రీతుల్లో ఉంది. జానపదులు రామాయణ, భారత, భాగవతాది కథలు- వీధి భాగవతాల, నాటకాల, హరికథల రూపాల్లో చూస్తారు, వింటారు. ఈ కథలు వాళ్ళకు చేరుకొనేసరికి కొన్ని మార్పులు చేర్పులు పొందుతాయి. వీటిని తమ జీవితాల్లోని సంఘటనలతో జత చేసి పాటలల్లుతారు. తాము పొందని సుఖాన్ని, అనుభూతుల్ని ఈ పాటల్లో చొప్పించి ఆనందిస్తారు. సీత కథ విని స్పందించి జానపదులు అనేక సందర్భాల్లో స్మరించినారు. జానపదుల మనస్తత్వం నాగరికుల మనస్తత్వం కంటే భిన్నమైంది. వాళ్ళమనోఫలకంపై ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క రకంగా ముద్ర వేయబడి ఉంటుంది. ఉదాత్త స్త్రీమూర్తి యొక్క పరిపూర్ణ మనస్తత్వం 'జానపద సీత'లో మూర్తీభవించి ఉంది. జానపదులు ప్రతి పనిని ప్రతి మాటను ప్రతి ఆటను, ప్రతి కదలికను ఆ మహావ్యక్తితో సరిపోల్చుకొంటారు. నిత్య జీవితంలో వాళ్ళతో కలసి మెలసి ఉండేటట్లు అనుభూతి చెందుతారు.

జానపద గేయ సాహిత్యంలోని 'సీత'ను జానపదుల మనస్తత్వ రీత్యా పరిశీలించడం ప్రస్తుత వ్యాసోద్దేశ్యం.

### స్త్రీల పాటల్లో సీత

ముఖ్యంగా స్త్రీ జీవితం సమర్త, పెండ్లి, సీమంతాలతో సాగిపోతుంది. మధ్య మధ్య వాళ్ళ జీవనగతి పనుల్లో లీనమై ఉంటుంది. ఆయా సన్నివేశాల్లో జానపదులు పాటలు పాడుకోవడం ఉంది. ఆ పాటల్లో ఉన్న సీత ప్రతీకను గమనించి వాళ్ళ అభిప్రాయాలను సేకరించడం జరుగుతోంది.

### లాలిపాటలు- జోలపాటల్లో సీత

తల్లి బిడ్డ కోసం పాడే పాటలు రెండు రకాలు. 1) లాలి పాటలు 2) జోల పాటలు. వీటిలో పిల్లల్ని సముదాయించడం, గొప్పవాళ్ళుగా భావించడం, బుద్ధి, బుద్ధి, సుద్దులు నేర్పి లోకజ్ఞానాన్ని పెంపొందించాలనుకోవడం మొదలైనవి వస్తువులుగా ఉంటాయి. 'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసం ఫణిః' అన్నట్లు పసిపిల్లలు కూడ గీత, సంగీత మాధుర్యాలకు చెవి కోసుకొంటారనడంలో సందేహం లేదు. ఇక్కడొక పాట —

'లాలి బంగారు బొమ్మ లాలి మా యమ్మ
లాలి ముద్దుల గుమ్మ లాలి సీతమ్మ-'[3]

'లాలి'తో మొదలెట్టి 'మాయమ్మ' మీదుగా 'సీతమ్మ' దగ్గరకు నడిచిందీ పాదం. తన బిడ్డను సీతగా భావించి, ముద్దూ ముచ్చటతో బిడ్డను చూచుకొంటోంది. తన బిడ్డను ఊపడానికి సీతను రమ్మంటోంది.

'హొజ్జొజ్జి కంబాల ఉయ్యాల కట్టి
ఊచి పాడుదు రావె రాఘవుల సీతా—' హొజ్జొజ్జి[4]

ఈ చిన్ని పాటలో ఊతపదం మాత్రమే 'హొజ్జొజ్జి అనేది. తన కొడుకును ఊచి పాడటానికి రమ్మని రాఘవుల సీతనే (ఆ పేరు గల 'స్త్రీ' కాదు అనడానికి 'రాఘవుల' అనే విశేషణం వాడబడింది) కోరుతోంది. ఇక్కడ తోటి స్త్రీగా సీతను భావించినారు.

రాఘవుల సీతకు లక్ష్మణుడే మరిది
దశరథుని కోడలే జానకీదేవి-' హొజ్జొజ్జి

బిడ్డకు జోల పాటలోనే సీతచరిత్రను బోధిస్తోంది వావి వరసలను నేర్పుతోంది. ప్రతి స్త్రీ తన బిడ్డను ఉన్నతంగా ఊహించుకొంటుంది. అంటే జానపద స్త్రీ మనస్సులో, హృదయంలో మరియు అణువణువులోను సీత వ్యక్తిత్వం జీర్ణించి ఉంది. తన వలెనే సీత కూడా బిడ్డల విషయంలో జోల పాడి తన పిల్లల్ని లాలించి నిద్ర పుచ్చినట్లుగా భావించినారు.

'ఏడవకు లవరాజ వెర్రి కుశలన్న,
ఏడవకు నా తండ్రి వెర్రి నా బాబు,

ఏడిస్తే నీ కళ్ళు నీరు కారేను,
నీరు కారిన కండ్లు నే జూడలేను,
పాలైన కారవే బంగారు కళ్ళు'[5]

సీత తన బిడ్డను సముదాయించే తీరును జానపదులు యెంత లలితంగా చిత్రీకరించారో చూసారా !

## సమర్త పాటల్లో సీత

'సమర్త' అను పదమునకు 'స్త్రీ ప్రథమ ఋతువు' అని అర్థము. సమ ఋతుః-సమరత-సమర్త- అనగా 'తొలిమట్టు' 'సమర్త' అసలురూపము సమర్థ. అనగా నేటినుండి ఆ బాలిక అన్ని విషయము లందును (ముఖ్యముగా వివాహమునకు) సమర్థురాలు అని చెప్పుట'[6] 'పెద్ద మనిషి అయింది' 'పిల్ల ఎదిగింది' అనే మాటలు దీన్ని సమర్థిస్తాయి. ఈ సమర్త విషయంలోను జానపద స్త్రీలు సీత ప్రతీకను వాడుకోవడం ఉంది.

'చెలియ గట్టిన బొట్టు సీర జూసి సకులెల్ల
అరుదుగా మన సీత సమర్త ఆడియున్నదో
రామచంద్రా-'

ఈ పాట వ్యవస్థ లోని బాల్య వివాహాన్ని గుర్తు చేస్తున్నది. అంటే జానపదుల సాంఘిక జీవితాన్ని ప్రతిబింబిస్తోంది. (నిజానికి సీత పెళ్ళి ప్రౌఢదశలో స్వయంవరం ద్వారా జరిగినట్లు రామాయణం చెబుతోంది.)

సమర్త శుభాశుభాలు తెలియజేస్తున్నారు. ప్రతి వారానికి ఒక శకునాన్ని చెప్పినారు.

'అల్లో నేరేడల్లో సీతాకళ్యాణంబు చెలువందనాయె-
॥అల్లో॥
,, ,, ఆదివారము నాడు అతిపేదరాలు-
॥అల్లో॥
,, ,, సోమవారము నాడు సాల పతివ్రత
॥అల్లో॥
అల్లో నేరేడల్లో మంగళవారము నాడు మొంతమారి
॥అల్లో॥
,, ,, బుధవారము నాడు పుత్రులను కనును
॥అల్లో॥
,, ,, గురువారము నాడు సంపదలు కల్గు
॥అల్లో॥
,, ,, శుక్రవారము నాడు సుదతిభోగియౌను
॥అల్లో॥
,, ,, శనివారము నాడు సతిరోగి యౌను
॥అల్లో॥[8]

పై గేయంలో 'అల్లో నేరేడల్లో' అనేది పల్లవి. ఈ పాటలో 'సమర్త' అనే పదానికి బదులుగా 'కళ్యాణం' అనే పదం 'శుభం' అనే అర్థంలో వాడినారు. ప్రతి స్త్రీ సమర్త విషయాన్ని లోకానికి చెప్పడానికి సీతను మాదిరిగా తీసుకోవడం జరిగింది.

'మంచి దినము నేడు మన రాముడు సీతా
అంచితంబుగ సమర్తలాడింది నేడు—అల్లో'-

అనే చరణంతో పై పాట ప్రారంభమవుతుంది. ఈ పాటలో సీతను జానపద స్త్రీగా జానపదులు అలంకరించిన తీరు తెల్పబడింది. దీన్ని జి.యస్. మోహన్ గారు ఇలా వివరించినారు [9] 'సోమవారము నాడు సీత సమర్తాడగా శ్రీరాముని తల్లి ముత్తైదులను పిలిపించినది. వారు సీతను పన్నీట స్నానమాచరింప జేసిరి. తెల్లచీరను కట్టిరి.

'ముత్తావు' రవికను తొడిగిరి. కస్తూరి తిలకమును తీర్చిరి. కనుల కాటుక దిద్దిరి. జడసొమ్ములు అమరునట్లు జడను శృంగారించిరి. నిలువాభరణములు సొమ్ము లమర్చిరి. ముక్కునకు ముక్కునత్తు పెట్టిరి. మాణిక్యముల చేత మంటపము లమర్చిరి. ఆణిముత్యములతో జాలరులు గట్టిరి. రత్న సింహాసనము పై సీతను కూర్చుండబెట్టిరి. 'అస్కర్ల' దీపములు రంజిల్లుచుండ ఇరువైపుల చెలులు వింజామరలు వీచిరి.' ఇదీ ఈ

గేయంలోని సారాంశం. చూచారా ! సీత సమర్త సందర్భంగా యెంత హంగామా చేసారో జానపదులు. వాళ్ళ మనోభావాల్లో మెదలుచున్న ప్రీతికరమైన ప్రతి వస్తువును సీత కమర్చి మురిసిపోయినారు.

'సీత సమర్త' అనే రామాయణపు పాటల్లో సీత సమర్త వేడుకలు చక్కగా చెప్పబడినాయి.[10] పేరుకిది సీత సమర్త పాటే అయినా ప్రధానంగా సీతారాముల శోభనపు వేడుకలు, రాముని కేళీగృహాన్ని సింగారించిన తీరు చక్కగా వర్ణింపబడినాయి. చాలా చిన్న వయసులో పెండ్లి చేయడం, సమర్త అయిన తర్వాత శోభనం చేయటం పూర్వాచారంగా ఉండేది. ఈ ఆచారం ఇప్పటికీ కొన్నిచోట్ల కనిపిస్తోంది. అందే పురాణేతిహాసాల్లో వుండే విషయాన్ని జానపదులు వ్యక్తం చేస్తూ, అదే సందర్భంగా తమ సమాజాన్ని ప్రతిబింబింప చేస్తున్నారు.

## పెండిపాటల్లో సీత

స్త్రీ జీవితంలో పెళ్ళి ప్రధానమైన ఘట్టం. 'స్త్రీ జీవితం పెండ్లితో ఆరంభమవుతుంది. పురుషుడి జీవితం పెండ్లితో అఖరవుతుంది' అని నానుడి. పెండ్లి ఆధారంగా చేసుకొని మరికొన్ని ఆచార వ్యవహారాలు, వేడుకలు, వినోదాలు. వాటి ఫలితంగా అనంతమైన సాహిత్యం ఉద్భవించింది వీటన్నింటిని కలిపి పెండ్లి పాటలనవచ్చును. పెండ్లికి సంబంధించిన పాటలు అనేక రకాలు. కట్నాల పాటలు, కళ్యాణం పాటలు, నలుగు పాటలు, తలుపు దగ్గరి పాటలు, వరుస పాటలు, హారతి పాటలు, అప్పగింతల పాటలు మొదలైనవి ఆయా సందర్భాలలో పాడే పాటలు లెక్కలేనన్ని ఉన్నాయి.

హిందూ సమాజంలో దంపతులనిపించుకోవడానికి జరిగే కార్యం పెండ్లి. పెండ్లిపై గల పవిత్ర భావం స్త్రీలలో సంస్కార ధర్మానికి దారి తీసిందనవచ్చును. ఈ పెండ్లి పాటల్లో మహా పతివ్రతగా 'సీతను గుర్తించి జానపదులు ప్రతి ఘట్టంలోను సీతను ప్రతీకగా చెప్పడం జరిగింది.

'ముత్తెము జూస్తి పగడము జూస్తి
పగడము వంటి నాధుని జూస్తి'

అన్నాడట రాముడు (వరుడు)

ముత్తెము జూస్తి, పగడము జూస్తి
ముత్తెము వంటి నాధునిజూస్తి'[11]

అన్నదట సీత (వధువు)

ఈ సన్నివేశాలన్నీ జానపదుల పెండ్లిసమయంలో వాళ్ళు భావ ప్రపంచంలో తారసపడేవే గాని మరొకటి కాదు. సీతను ఒక వైపు గాను, రాముని మరొకవైపు గాను చిత్రించుకొని పాట అల్లుకోవడం జరిగింది.

పెండ్లి పాటల్లో మంగళసూత్రధారణ సమయంలో ముత్తైదులు మంగళసూత్రం పాటలు పాడుతారు. ఈ పాటల్లో కూడా వధూవరులుగా సీతారాములే ప్రత్యక్షమవడం ఉంది,

'ఆనంద మానంద మాయెను
మన రాముడు పెండ్లి కొడుకాయెను
ఆనంద మానంద మాయెను
అలనాటి జానకి పెండ్లి కూతురాయెను
కౌసల్య నోచిన నోము సఫలమాయెను-" [12]

"అనుచు ఆనందమును పట్టలేక పాడినారు అంగనామణులు. రత్నాల పలకపై సీతారాములు కూర్చొనినారు. చెలులతివేగముగా విరులు శృంగారించినారు, బ్రహ్మానంద వాద్యములు మ్రోగింపబడనవి"[12] జానపదులకు ప్రతివిషయం అమోఘమైందే. అందుకే వాళ్ళు చిన్న విషయాన్ని చెప్పదలచినా ప్రియమైన పదజాలాన్ని ప్రయోగిస్తారు. వాళ్ళ ప్రియవస్తువులు పాటల్లో కోకొల్లలుగా కనిపిస్తాయి. వాటిలో వాళ్ళకి సీత అత్యంత ప్రియమైన ఆభరణం.

పెండ్లి మంగళ సూత్రధారణ తర్వాత ముఖ్యమైన ఘట్టం నలుగు పెట్టడం, వాటిని 'నలుగు పాటలు' అంటారు.

"నలుగిడ రారమ్మా నలినాక్షులారా! ఓ నలినాక్షులారా!" అని సీతమ్మకు, సీతమ్మతో కూడి జత శ్రీరామునకు నలుగిడ రమ్మన్నారు. తూర్పు ముఖమును చూచి వారిని కూర్చుండ బెట్టి నేర్పుతో నలుగులు తీర్చుమన్నారు. గంధము నలుగులు అందముగ నిడుటకు పొందుగా సీతమ్మ హస్తమును కోరినారు.

'అత్తారు నలుగులు కొత్తాగ వినుమా అన్న
వనితాలు తెచ్చెదరు హస్తా మిమ్మానె'

శ్రీరాముని కోరినారు.

పన్నీరు నలుగులు ఉన్నావి వినుమా అమ్మ
తిన్నాగ చేయి నిమ్మని సీతమ్మ నడిగినారు.

అట్లే

కస్తూరి నలుగులు, జవ్వాదులు రఘురామునకు
పునుగులు సీతమ్మకు పూయ చేతులందని' కోరినారు.

సురలు భూసురులందు మరి చోద్యంబు నొంద అమ్మ
ధరలో పుష్పాల వరుషంబు గురియా'

సీతారాములకు నలుగిడినారు [13] సీతను 'అమ్మగా' రాముని 'అన్న'గా భావించి నలుగులు పెట్టినారు. సాధారణంగా జానపద స్త్రీలు పర పురుషులను 'అన్న' అనడం ఉంది.

'అమ్మ' 'అక్క' 'చెల్లి' అనేవి స్త్రీని ఆదర పూర్వకంగా వయోభేదం లేకుండా సంబోధించే తీరు.

"రాముల చూడరమ్మ, రఘువంశాబ్ధి సోముని
పెండ్లినేడమ్మా" [14]

సీతా కళ్యాణ మహోత్సవ సమయం చూతా
మురారే చెల్లి" [15]

"శ్రీరామ జయరామా, శ్రీరామ సీతాపతి
రామా" [16]

లాంటి పాటలెన్నో ఉదహరణాలివ్వవచ్చును.

"హారతి గైకొనుమా శ్రీరామా సీతతోడ నేడు నీవు" [17] అనేది హారతిపాట.

శ్రీరామచంద్రమా సీతమ్మ నింకేరీతిగా కాపాడు కొందువో" [18] అనే అప్పగింతల పాటతో పెండ్లి కార్యం ముగుస్తుంది ఇవన్ని జానపదులు ఏ స్త్రీకైనా జరిపే కార్యాలే అయా కార్య సందర్భంగా సీత పేరును ప్రస్తావించడం జరిగింది.

ఆడ పిల్లలకు పెళ్ళిచేసి అత్తవారింటికి పంపడం సంప్రదాయం. ఆ ఆచారం యీ పాటలో కనిపిస్తోంది.

"నెలతరో కన్నకూతురువు గనుక నేనొక్క బుద్దెరిగిస్తు
వినుమా! నాథుని ముంగిట నెన్నడు పకపక నవ్వకుమీ,
సుందరీ నాథుని కన్నా ముందర మేల్కొను సుమ్మీ,
పలుకకు, నిందించకు కలనైనా పంకజాక్షి సీతా,
చెలువుడు ప్రాణేశుడు పిలువక కాయబోకు పనులూ,
పిలిచిన వేళకే పలుకుచుండుమీ కలకంఠిరోనీవూ,
అత్తమామలకు జనులకు భక్తిగ సేవలు సేయుమీ,
హెచ్చుగా వదిన మరదళ్ళతో మెచ్చుగ దిరగకుమీ.
ఆశగా బిలిచిన వార్ని ఎప్పుడుఆశ యెరిగి కాపాడుమీ
నీ సరివార్ని హాస్యము కాయకుమీ—" [19]

అని జనకుడు సీతకు బోధ చేసినాడు జానపదులు కల్పించుకొన్న ఈ పాటలో సీత కేవలం ప్రతీక. ఆ సీత నాధారం చేసుకొని వాళ్ళ మన స్తత్వాన్ని, భావాన్ని, వేడుకల్ని వినోదాల్ని, సంప్రదాయాల్ని సీతకు ఆపాదించి పాడుకోవడం ఈ పాటలో కనిపించే ప్రధానాంశం. అంటే రామాయణం లోని రాజకూతురు సీత. ఇక్కడ సామాన్య జానపద స్త్రీగా మారింది.

సీమంతం పాటల్లో సీత

"షోడశ సంస్కారాలలో సీమంతోన్నయిన మొక

స్త్రీ సంస్కారము. దానివలన గర్భిణీస్త్రీకి ఆరోగ్య పుష్టి, మనస్సంతుష్టి, గర్భస్థిరత్వము చేకూర్చుట యగును. స్త్రీ గర్భవతియైన నాల్గవ, ఆరవ, ఎనిమిదవ మాసాలలో నేదేని యొక మాసంలో సీమంతము చేయుట నియమము. అత్తవారింట నున్నచో పుట్టింటవారు, పుట్టింట నున్నచో అత్తగారు సీమంతము జరుపుట పొసగుచుండును.[20] సీమంత సమయంలో పాడే పాటలు 'సీమంతం పాటలు'.

సీతాదేవి సీమంతం గావించిన తీరు ఈ క్రింది పాటలో చెప్పబడుతోంది. (నిజానికి సీత ఇటు అత్త వారింటిలోను అటుపుట్టింటిలోను లేదు)

సీతాదేవికి "పన్నీటను జలకమార్చి కన్నుల
కాటుకలు దీర్చి
వెన్నున వాల్జడలమర్చి సన్నజాజి
విరులు గూర్చి,
కదలి పనస నారికేళి ఖర్జూర ఫలము
లతో
విధితమైన శుభవస్తువులధికముగవడినిడి"

అంతేగాక —

"సీతకు చలిబిండి వంటలు కళ్యాణికి వడినిడి" నారట
"అనేకాలైన పిండివంటలు కళ్యాణికి వడినిడి" నారట

ఈపాట పల్లవి-
సీమంతం చేసిరపుడు సీతకు శృంగారవతికి;
రామచంద్రు దేవేరికి రాజ్యముఖికి సుకుమారికి-"[21]

ఈ సీమంతమే శ్రీమంతమైందనడానికి—

జానకీదేవి శ్రీమంత మనరే
శ్రీ మహాలక్ష్మి సుందరావదనాన్నిగా నరే"[22]

అనే పల్లవే సాక్ష్యం. ఇది జానపద నిరుక్తి (Folk Etymology) కి ఉదాహరణ.

సీమంతం పాటలో వడినింపడమనేది ఒక ఆధారం.

మామ దశరథు డండినాదీ
మంచి మామిడి పండులూ
అమ్మకు వడినించరే
సీతమ్మకు వడించరే-"[23]

అని పాడుతూ వడినింపినారు. అట్లే

"మరిది లక్ష్మణు డంపినావీ
మంచి మల్లెల మొగ్గలూ
అమ్మకు జడ గుచ్చరే
సీతమ్మకు వడినించరే—" అని జడ గుచ్చినారు. ఇలా సీమంతం పాటల్లో జానపద మనస్తత్వ రీత్యా సీత చోటు చేసుకొంది.

తల్లి జానకి తండ్రిరాముడున్నారయా ప్రియముక్తి
యేకాంత
ఇల్లు నిత్య విభూతి మిత్రులు నెల్ల భూసురులని.'[24]

జానకిని తల్లిగా, శ్రీరాముని తండ్రిగా భావించి తరించినారు. ఆంధ్రుల ఆరాధ్య దైవం శ్రీరామచంద్రుడు. సీతమ్మ ఇలవేల్పు. సీత లేని రాముడు, రాముడు లేని సీత, సూర్యచంద్రులు లేని ఆకాశవీథి లాగ భావిస్తారు జానపదులు. వీటికి ఆధారం వాళ్ళపై ప్రతి సందర్భాన గల జానపద గేయాలే.

## నాట్లు మరియు కలుపు పాటల్లో సీత

జానపదులు కష్టపడి పనిచేసేటప్పుడు ఆ కష్టాన్ని మరచిపోయి ద్విగుణీకృత ఉత్సాహంతో పని చేయడానికి పాటలు పాడుకొంటారు. ఆ పనిలోని హావభావాది చేష్టల కనుగుణంగ, ఆ పాటల్లోని తాళ లయలు ఇమిడి ఉంటాయి. భారత రామాయణ భాగవతాలకు సంబంధించనవిగా ఉంటాయి. చారిత్రక గేయాలు, శృంగార రసాత్మక గేయాలు, కథారహితాలు, కథాసహితాలైనవి కూడ నాట్లు వేసేటప్పుడు పాడుకోవడం ఉంది.

యెండాకాలంలో దాదాపు నెలపైర్లు నాట్లువేస్తారు. నాట్లు వేసేటప్పుడు చాలా పాటలు పాడుతారు. అట్లే నాట్లయిన తర్వాత ఒకటిన్నర నెలకు కలుపు మొక్కల్ని పీకడానికి పోతారు. ఈ కలుపు తీసేటప్పుడు కూడా కొన్ని గేయాలు పాడటం ఉంది.

"శ్రీరామ రామ శరనా వడవిలోగట్టిరి అరిపనకాలి
శ్రీరామ రామశరనా
,, పరనకాలికి రెండు పంచటరుగుల్లు ,,
,, పంచటరుగుల్లమీద సీమల్లపుట్ట ,,
,, సీమల్లపుట్టమింద సిరిపాప పరిసి ,,
,, వొన్నె వెన్నెల 'మొగము' వాకిండ్ల
వావె ,,
,, సీత సూత్తుందాని సిరసడ్డగించె ,,
,, కాంత సూత్తుందాని కాలడ్డగించె ,,
,, ఆ మొగము తట్టింక సూసె సీతమ్మ-" ,, 25

ఇలా సాగిపోతుందీపాట. సీతాపహరణాన్ని తెలిపే గేయం. మాయలేడిని సీత చూడటం, ఆ మృగాన్ని (మొగము) కోరడం, రామలక్ష్మణులు మృగాన్ని వెంబడించడం, రావణుడు సీతను అపహరించడం జరిగిపోతుంటి.

కష్టసమయాల్లో సీతారాముల కష్టాలను తలపోసుకొంటూ తమ కష్టాలను మరచిపోతుంటారు జానపదులు. ఇతరుల కష్టాలే తమ కష్టాలుగా భావిస్తారు. కాని అంతర్గతంగా వాళ్ళకు కష్టం కలిగించే భావ ప్రేరణలే సీతారామ కష్టప్రతీకలు. కష్టపడినవారంటే వాళ్ళకు మరీ ఇష్టం. అలాంటి కష్టాలతో కూడిన కథలు విన్నప్పుడు జానపదుల హృదయాలు ఆర్ద్రతతో నిండిపోవడమే గాక కన్నీళ్ళు కట్టలుతెంచుకొని పారుతాయి.

## విసర్రాతి మరియు దంపుడుపాటల్లో సీత

విసర్రాతితో పిండి విసిరేటప్పుడు, ధాన్యం దంచేటప్పుడు స్త్రీలు పాడేపాటలే విసర్రాతి పాటలు. దంపుడు పాటలు. స్త్రీ మనస్తత్వం ఈ పాటల్లో చక్కగా వ్యక్తమవుతుంది. స్త్రీలకు పుట్టింటిపై మమకారం ఎక్కువ అత్తవారింటిలో కోడలు పని పాటలు చేసేటప్పుడు కూడా పుట్టింటివాళ్ళనే తల్చుకొంటూ ఉంటుంది. అన్నదమ్ముల్ని తల్లిదండ్రుల్ని చూడాలని ఎప్పుడూ ఉబలాటపడుతూ ఉంటుంది. చెప్పుకోవాలంటే అత్తగారి భయం. ఆమె మనసులోని భావాల్ని పలికే గేయాల్ని పాడుకొంటూ ఉంటుంది. దంపుల్ల పాటల్లో ఎత్తివేత లెక్కువగా ఉంటాయి.

సీత ప్రసక్తిలేని జానపద స్త్రీల పాటలు లేవంటే అతిశయోక్తికాదు. "చెఱబోయిన సీతమ్మ చిత్తరువులోనిది. రామనామస్మరణ ముందు రావణబ్రహ్మ పెట్టెడి హింసలు ఆమె లెక్కలోనివికావు. సీతమ్మకును, శ్రీరామదూతకును జరిగిన సంభాషణమిది.

"ఎక్కడా జూసినా ఈ కారడవిలో,
ఒక్కతే వున్నావు వనదేవి సీతా
అమిసల్లు కోగిలలు అవిలక్షగలవూ,
అనుమంతు డుండంగ అనుమానమేల ?
సింకల్లు గోరికెలు అవి లక్షగలవూ,
శ్రీరాము డుండంగ సింతేల మనకూ—" 26

బ్రాహ్మణేతరులందు నాకబలైన తర్వాత వధువు చేత పత్తివిత్తులు గుల్ల పట్టించి వరుని వెనుక నడిపించుచు ("శ్రీరాము దున్నంగ సీత చాలేసు") విత్తనాలు నాటింతురు అప్పుడు పాడేపాటల్లో కూడా సీతారాముల ప్రసక్తి తెచ్చినారు.

విత్తనాల గుమ్మి మెత్తైన దీసి-పన్నెండు స్తంభాల
పందిరికింద
——— శ్రీరాముడు దున్నంగసీత చాలేసు-" 27

అనే పాటలో పత్తి విత్తులు గుమ్మివాదట సీత. అంటే సీత జీవనం కూడా జానపద గ్రామిక జీవనం వంటిదేనని జానపదుల అభిప్రాయం.

"సువ్వి సువ్వి రామచంద్ర-సువ్వి సువ్వికీర్తిసాంద్ర
సువ్వి సీతమ్మకు-సుఖము లిమ్మా—" [28]

సువ్వి కావేటి రంగ-సువ్వి కస్తూరి రంగ
సువ్వి రామాభిరామ-సువ్విలాలి—" [29]

"లక్షణవతి సీత గుణములు పాడుచు—గోధుమ లిసరి సుంకులు చెరిగిరి" [29] ముత్తైదులు పైవిధంగా దంపుడు పాటల్లోకూడా సీతను గురించి అనేక జానపదాంశాలు నిక్షిప్తమై ఉన్నాయి.

## మంగళహారతి పాటల్లో సీత

మంగళారతులు భక్తి సంబంధాలు. శుభ కార్యాలలో పూజాంతాలలో వీటికి ప్రాచుర్యం ఎక్కువ మంగళం, శుభ మంగళం, జయమంగళం వంటి ఉదాంతాలు కలిగ ఉంటాయి. కాబట్టి ఇవి 'మంగళం' పాటలని పిలువబడుచున్నాయి. 'మంగళం' అంటే 'శుభం' అని అర్థం. మంగళ హారతి పాటల్లో సీత ప్రశంస కన్పిస్తుంది.

"హారతి గైకొనుము శ్రీరామా సీతతోడ నేదే
నీవు-" [30]

"సీతాదేవి పుట్టలోనే పుట్టి పుట్టలోనే పెరిగి పుట్టలో నుండి వచ్చిందట అట్టి సీతమ్మకు అత్తరు కుంకుమ పెట్టి హారతులనినారు. జానపదుల ఊహాకిది గీటురాయి[30] ఇక్కడ సీత ఉదాత్తవ్యక్తి.

## పురుషుల పాటల్లో సీత

కోలలచే ఆడుకొనే ఆటను కోలాటం అంటారు కోలాటం జానపదుల నృత్యం. అదొక వినోదపుఆట. కోలాటం ముఖ్యంగా పురుషులకు సంబంధించింది.

జానపద పురుషుల్లో 'సీత'కు ఎలాంటి స్థానం ఉందో తెలుసుకోవటానికి కోలాటం పాటలు పరిశీలించ దగినవి. వాళ్ళభావాల్లో గల సీతస్థితి గతుల్ని పరిశీలిస్తాం.

ఈ క్రింది కోలాటం పాటలో హనుమంతుని, రావణుని మధ్య సంభాషణం సూచితం

యే దేశ పరుడవో ॥యే దేశ॥ యే రాజు బంటువో
యెందుండి వస్తివిర వోరి వనచరీ ॥యెందుండి॥
సుంగారి వనములో సీతమ్మ వుందని।
సూడ బోనొస్తిరా వోరి రావణుడా !-' [31]

జానపదుల గుండె నిండా రామాయణం ఉంది. వాళ్ళ శ్వాసలో 'సీత' తారస లాడుతోంది. సీతను తెచ్చిన రావణుడంటే జానపదులకు అయిష్టం. అందుకే హనుమంతునితో పైమాట లనిపించినారు. ఇలా అనేకమైన కోలాటం పాటల్లో వివిధ భావనల్తో సీత చోటు చేసుకొని ఉండటం కనిపిస్తుంది.

## ఏల పాటల్లో సీత

వీటినే కపిల పాటలు, మోట పాటలు అంటారు పంటకు నీటిని తగ్గు ప్రాంతం నుండి మిట్ట ప్రాంతానికి చేదుకోవడానికి కపిలె లేక మోట నుపయోగిస్తారు. ఈ సమయాల్లో పాటలు పాడుకొంటారు వీటినే 'కపిల పాటలు' లేక 'మోట పాటలు' అంటారు. ఈ పదాలనే రైతులు పొలం దున్నేటప్పుడు కూడ పాడుకొంటారు. అందుకే వీటన్నింటిని కలిపి 'ఏల పదాలు' అంటారు.

ఇవి జానపద పురుషుల శ్రామిక గేయాలు. రెండు చరణాలుగా ఉంటాయి. నిజానికి జానపదుల జీవితమే శ్రమ జీవితం. వాళ్ళకు తీరిక చాలా అరుదు. నిరంతరం శ్రమిస్తారు. శ్రమ వేళల్లో కూడ పాటలు పాడుకొనడం వాళ్ళ అలవాటు. పాట శ్రమను మరపిస్తుంది. ఈ పాటల్లో సీత నెలా ప్రతీకగా గైకొన్నారో గమనిద్దాం.

"రామ రామా అంటావు సీత-రాముడేమి కావాలమ్మా!
రాముడు మన దేవుడు-లచ్చనుడు ముద్దు మరది!!" [32]

ఇక్కడ భర్తే దైవమనేది స్పష్టం.

సీత బుట్టి లంక చేరె- చిన్నకాపురాలు కూలె!

బాటడు వనమన్న పుట్టె- బంగారు వారధి కూలె!!"33 మహా పతివ్రత చరవల్ల అనేక అనర్థాలు జరుగుతా యనేది సారాంశం.

ఏలపదాలు రెండు పాదాలుగా వుండి ఏక విష యాశమాలుగా ఉంటాయి. నడిమికి తుంచి వేస్తే నాలుగు పాదాలు. పల్లెటూళ్ళ బతుకులకు ఈ పాటలు ప్రతిరూపాయి. ఇవి సాధారణంగా శృంగార రస ప్రధానమైనవిగా ఉంటాయి. సీతారాములు లేని జాన పద పాటలు లేవనడానికి నిదర్శనం. ఈ పదాల్లో కూడా సీతారాములను ప్రతీకలుగా గ్రైకొనటం.

పై విధంగా జానపదగేయ సాహిత్యం సర్వ స్వంలో 'సీత' జానపదుల ద్వారా చోటు చేసుకొంది. జానపదులు మనోనైర్మల్యం కలవాళ్ళు వాళ్ళ మనో హృదయ భావాలే జానపద గేయ సాహిత్యం. సీత జానపదుల నిత్యజీవితంలో చోటు చేసుకొని ఆయా సందర్భాలలో వాళ్ళ మనోహృదయాలను స్పందింప జేసోంది.

"పల్లెటూళ్ళ బతుకంతా ముద్దకట్టిన మూర్తులుగా ప్రవర్తిల్లినవీ పల్లెపాటలు".34 కృషీ వలుడగు జాన పదుడు నాగరికునకు కూడు పెట్టువాడు. రక్తమును సిరుగా పారించి రెయింబవళ్ళు కష్టించి పనిచేసి పంటలు పండించి మనకన్నం పెట్టును. కాని దౌర్భా గ్యమేమిటో గాని చమటోడ్చి ప్రపంచానికి భోజనము పెట్టువానికి భుక్తిలేదు "35 బ్రిటీష్ వాళ్ళేర్పరచిన వ్యవస్థలో పట్టణాల్లో నుండిన ప్రభువులు. గ్రామా లలో నుండి అధికారులు బీదరైతును పీల్చి పిప్పి చేసారు. కాని స్వాతంత్ర్యానంతరం కూడా రైతు జీవితం మారలేదు వాడు కష్టించి మనకన్నం పెట్ట డమే కాక వాడిపాట నుండి కూడా మనకానందాన్ని పంచుచున్నాడు. కాని వాళ్ళ హృదయ భారాన్ని జీవిత సమస్యలను గుర్తించుచెప్పుడు? కృషీవలుని గుర్తింపు వస్తుందని ఆశిద్దాం. గాంధీ కలలుగన్న గ్రామ స్వరాజ్యం కోసం ఎదురు చూద్దాం.

## తోడ్పడిన గ్రంథాలు


(1) తెలుగు జానపద గేయ సాహిత్యము-ఆచార్య. బి రామరాజు.
(2) పల్లెపదాలలో ప్రజాజీవనం- డా॥ యెల్దండ రఘుమారెడ్డి.
(3) స్త్రీల పాటలు (అనంతపుర మండలం) —డా॥ జి యస్. మోహన్.
(4) జానపద కళాసంపద (ప్రథమ సంపుటము)-డా॥ తూమాటి దోణప్ప.
(5) తెలుగు బాలగేయ సాహిత్యం-డా॥ యం. కె. దేవకి.
(6) స్త్రీల రామాయణపు పాటలు—కృష్ణశ్రీ సంకలనము.
(7) తెలుగులో కొత్త వెలుగులు-డా॥ తూమాటి దోణప్ప.
(8) ధర్మవరం తాలూకా జానపద గేయాలు-డా॥ చిగిచెర్ల కృష్ణారెడ్డి.
(9) గబ్బిలము-జాషువా.


## అథస్సూచికలు

1. ఆచార్య బి, రామరాజు-తెలుగు జానపద గేయ సాహిత్యము పుట-1

2. డా॥ జి. యస్ మోహన్-స్త్రీల పాటలు (అనంతపుర మండలము) పుట. 4
3. ఆచార్య బి. రామరాజు-తెలుగు జానపద గేయ సాహిత్యము పుట-473
4. స్త్రీల పాటలు (అనంతపుర మండలము) డా॥ జి. యస్ మోహన్ పుట-28
5. డా॥ యం కె. దేవకి-తెలుగు బాలగేయ సాహిత్యం, పుటలు 85-97
6. డా॥ జి. యస్. మోహన్-స్త్రీల పాటలు (అనంతపుర మండలము) పుట-50
7. జి. యస్ మోహన్- స్త్రీలపాటలు (అనంతపుర మండలము) పుట-66
8. జి. యస్. మోహన్- స్త్రీలపాటలు (అనంతపుర మండలము) పుట-64
9. జి. యస్. మోహన్- స్త్రీలపాటలు (అనంతపుర మండలము) పుట-69
10. 'కృష్ణశ్రీ' సంకలనము-స్త్రీల రామాయణపు పాటలు-పుటలు-92-98
11. డా॥ జి. యస్. మోహన్-స్త్రీలపాటలు (అనంతపుర మండలము) పుట-92
12. ,, ,, ,, పుట-93
12. జి. యస్. మోహన్-స్త్రీలపాటలు-(అనంతపుర మండలము) పుట-98
13. డా॥ జి. యస్ మోహన్-స్త్రీలపాటలు (అనంతపుర మండలము) పుటలు-118-119
14. 15 16 ఆచార్య. బి. రామరాజు. తెలుగు జానపద గేయ సాహిత్యము పుట-479
17. డా॥ జి. యస్. మోహన్-స్త్రీలపాటలు-(అనంతపుర మండలము) పుట-121
18. ,, ,, , పుట-121
19. ఆచార్య. బి. రామరాజు తెలుగు జానపద గేయసాహిత్యము పుట-485
20. డా॥ యెల్దండ రఘుమారెడ్డి-పల్లెపదాలలో ప్రజాజీవనము-పుట-501
21. డా॥ జి. యస్ మోహన్-స్త్రీలపాటలు(అనంతపుర మండలము) పుట-180
22. ,, ,, ,, పుట-181
23. డా॥ జి యస్ మోహన్, స్త్రీలపాటలు (అనంతపుర మండలము) పుట-181
24. డా॥ యెల్దండ రఘుమారెడ్డి-పల్లెపదాలలో ప్రజాజీవనము
25. చిగిచర్ల కృష్ణారెడ్డి-ధర్మవరం తాలూకా జానపదగేయాలు-పుటలు-42-43
26. డా॥ తూమాటి దోణప్ప-జానపద కళాసంపద [ప్రథమ సంపుటము] పుట-188.
27. డా॥ యెల్దండ రఘుమారెడ్డి-పల్లెపదాలలో ప్రజాజీవనము-పుట-280
28. ఆచార్య. బి. రామరాజు-తెలుగు జానపదగేయ సాహిత్యము-పుట 479
29. డా॥ జి. యస్. మోహన్-స్త్రీలపాటలు (అనంతపుర మండలము) పుట-79.
30. డా. జి. యస్. మోహన్-స్త్రీలపాటలు (అనంతపుర మండలము) పుట-246.
31. డా॥ తూమాటి దోణప్ప-జానపద కళాసంపద ((ప్రథమసంపుటము) పుట-85
32. చిగిచర్ల కృష్ణారెడ్డి-ధర్మవరం తాలూకా జానపద గేయాలు పుట-39.
33. ,, , పుట-39.
34. డా॥ తూమాటి దోణప్ప-తెలుగులో క్రొత్తవెలుగులు రేడియో ప్రసంగాలు మొదటిసంపుటి. పుట-197
35. జాషువా-గబ్బిలము-Introduction.


పరిశోధక విద్యార్థి, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం.

# బిల్హణీయము- ఒక పర్యాలోకనము

— కరిమద్దెల నరసింహారెడ్డి

సంస్కృతమునందు "బిల్హణ చరితమ్" అను కావ్యము కలదు దీనిని "బిల్హణుడు" అనుకవి రచించెనని పండితులు చెప్పుచున్నారు తెలుగునందు "బిల్హణీయము" అను కావ్యాన్ని పండిపెద్ది కృష్ణస్వామి రచించినట్లు ఆశ్వాసాంత గద్యనుబట్టి తెలియుచున్నది. ఇది ముచ్చటగా మూడు ఆశ్వాసాలుగల ప్రబంధము. ఇది ఆనందముతో పఠింపదగిన ప్రబంధము. జీవితములోని స్వారస్యాన్ని, అనురాగంలోని అమృతాన్ని చవి కావించు మధురమయిన కావ్యము "మదనాభిరాముడు" అను పేరుగల రాజు పాంచాలదేశాన్ని పరిపాలించుచుండెను. ఆతనికి "మందారమాల" అను పేరుగల భార్య కలదు. ఆ దంపతులకు "తోయజసాయకుని ఆలవ సాయకము"ని భూజనులు సన్నుతి చేయుచుండగా ఒక పుత్రిక పుట్టినది. ఆమె పేరు "యామినీ పూర్ణతిలక" ఆమె దినదిన ప్రవర్ధమానమైనది, తగిన సమయంలో తండ్రి విద్యాభ్యాసము చేయించినాడు. వీణా వాదనాది గాన కళయందు చతురాలయింది.

"చెలగు చిరునవ్వు వెన్నెలల్ చిలుకుచుండ
కలికి తెలిడాలు చూపులు కలయ పర్వ
పాండిమము తోచి భారతి భాతి నాతి
పసిడి గద్దియపై పాట పాడుచుండె"—

యామినీ పూర్ణతిలక సంగీత సరస్వతియైనది. ఇక మదనాభిరామ భూపతి తన పుత్రికను సాహిత్య సరస్వతిని చేయదలచినాడు ఒకనాడు వసంతుడను తన మంత్రిని పిలువనంపి "అయ్యా! నా పుత్రిక సంగీతము నేర్చినది. ఇక సాహిత్యమునందు చతురమతిని చేయవలయును" అన్నాడు. వసంతుడు నగరములోని సమస్త శాస్త్రపారంగతులను పిలువనంపినాడు. మదనాభిరాముడు ఆ పండితులను "కావ్య, నాటక, అలంకార, ఛందశ్శాస్త్ర సాహిత్య కళానిధి ఎవరో నాకు చెప్పండి" అని అడిగినాడు

"ప్రాయములోనన మహిత యౌవనము మేలు
పరుగు పదవులలో విష్ణుపదవి మేలు
మహిత గీతులలో పంచమలయ మేలు
కవులలో నెల్ల బిల్హణకవియె మేలు.

మృగములోన సింహము, అవనీంద్రులలో రఘురామ మూర్తి ప
న్నగములలోన శేషుడు వనమ్ములలోపల నందనమ్ము
దేవ గణము లోన శంకరుడు వార్ధులలోన పయోబ్ధి యెల్ల నో
మిగుల కవీంద్ర సంతతిని మేటియ బిల్హణుడట్లు చూడగన్—" అని

పండితులు బిల్హణకవీంద్రుని యోగ్యతను ప్రశంసించి చెప్పినారు.

మదనాభిరాముడు కవితాభిరాముడయిన బిల్హణుని తన కొలువు కూటమునకు పిలిపించినాడు. బిల్హణుడు ఛాత్ర సంఘములు వెంట వచ్చుచుండగా రాజ మార్గమున పోవుచుండెను. పురవీధులందు పురాంగనలు బిల్హణుని చూచి

"ఎవ్వడు వీడు! చక్కదనమేమన! వెన్నడు చూడ! మెవ్వడో!

పువ్విలు కాడో! యా దనదపుత్రుడో! చంద్రుడో!
యా జయంతుడో!
యివ్వనితా శిరోమణుల హృద్వనముల్ చిగిరింప
చేయగా
జవ్వని! యేగుదెంచిన వసంతుడో! చూడగ నాకు
నావుడున్——" అని తలం

చిరి. కొలువుకూటమునకు వచ్చిన బిల్హణుడు కొంత కవితా ప్రసంగము చేసినాడు. రాజు సత్కరించి పంపించినాడు. రాజు మంత్రిని పిలిచి "ఇతడు సుంద రమయినవాడు. ఇతనిని చూచి యువతులు మతులు పోగొట్టుకొందురు. ఈతనివద్ద యామినీ పూర్ణతిలకను విద్యాభ్యాసానికి వదలుట ఎట్లు?" అనెను. మంత్రి ఆలోచించి "మహారాజా! మన యామినీ పూర్ణతిలక అంధుని చూడదు కదా! కవి కుష్ఠురోగిని చూడదని విన్నాము. కనుక యామినికి కవి అంధుడని చెప్పుదము. కవికి యామిని కుష్ఠురోగి యని చెప్పుదము. ఇరువురు ఒకరిని ఒకరు చూచుకోరు. ఇరువురకు నడుమ ఒక తెర అడ్డముకట్టించుదము. చదువు సాగుట కభ్యంతరముండదు" అని ఉపాయము చెప్పెను. మంత్రి చెప్పిన ప్రకారము ఏర్పాట్లు చేసినారు. యామినీ పూర్ణ తిలక గురువు వద్ద కొంత కాలానికి కవిత్వము చెప్పెడి సామర్థ్యము సంపాదించినది. ఇంతలో వసంతఋతువు వచ్చినది. ఒకనాడు బిల్హ ణుడు సాంధ్యకృత్యములు ముగించి మజ్జన భోజనా దులు ముగించుకొని చందన చర్చ చేసికొని, తాంబూల చర్వణము చేస్తూ తెరకు ఆవలకయ్యా తల మున పడుకొని ఉదయించుచున్న చంద్రుని చూచి వర్ణన చేయుచుండెను. యామినీ పూర్ణతిలక భోజనము చేసి, తాంబూలము నమలుచు తెరకు ఇవతలప్రక్క కయ్యపై కూర్చొని బిల్హణుడు చేయు చంద్ర వర్ణ నము విని ఆశ్చర్యచకితయై

"అంధుడెక్కడ! చంద్రుడెక్కడ! తదీయంబైన
యా వర్ణనా
బంధం బెక్కడ! యిట్టి వింత గందె? భావింప
నెచ్చోటనై
నం ధాత్రీంద్రుడు మాకు నిర్వురకు నందం బొప్ప
నన్యోన్య హృ
త్సంధానం బగు నంచు చేసె నిటులం చర్చింబ
వేఱున్నదే?"—— అని

తలంచి వ్రతభంగమయినను ఫరవాలేదు. ఇతనిని చూడవలయును అని నిర్ణయించుకొని తెర ఒత్తిగించి బిల్హణుని మధురాకృతిని చూచి, సమ్మోహితయై యామినీ పూర్ణ తిలక మూర్ఛిల్లినది. బిల్హణుడు పూర్ణ తిలక సౌందర్యాన్ని తిలకించి పులకించి రసావేశ ముతో

"వనజ మహా విభూతి హరి వైఖరిగాం పద స్తనోక్తు
లన్
వనజ మహా విభూతి హరి వైఖరి మించు గళోరు
వేణికల్
వనజ మహా విభూతి హరి వైఖరి దూరు కరాక్షి
మధ్యముల్
వనజ మహా విభూతి హరి వైఖరి నొంచు దృగాస్య
యానముల్-" అని

అభివర్ణించాడు. బిల్హణుని పలువలు విధముల పద్య ములు విని యామినీ పూర్ణతిలక తేరుకొనినది. కవిని చూచి సౌందర్యమునకు మురిసిపోయి తనువు మరచి పోయినది.

"చదువు చెప్పంగ గురుడయ్యె. సాహసమున
చూడ చూడంగ మరుడయ్యె సోయగమున"—

'చతురాస్య' సంతాపము కలిగింది. కరుణ చూచి సంతోషం కలిగించు, బాధ తప్పించు" అని పూర్ణ తిలక నర్మగర్భముగా పలికినది. నవరస రసికుడ యిన బిల్హణుడు పూర్ణతిలక భావము గ్రహించినాడు. "తామరసాక్షి నీ చూపుల తూపులకు నా హృదయము గాయమయింది. అది మానిపోవుటకు రెండు రకాల

మందు ఇమ్ము. నీ మధుర అధరామృతము త్రాగె దను. నీకుచకుంకుమ పంకము పూశ పూసెదను" అన్నాడు.

"రమణి! మీ తండ్రి మదనాభి రామ నృపతి
చేసినట్టి వినోదంబు చిత్రమయ్యె
చిత్తమున వేఱు తలపక చెలగు మతుల
రతుల భయమింక వలదిట రాజు వలన"—

అన్నాడు. యామనీ పూర్ణతిలకకు-బిల్హాణునికిగాంధర్వ వివాహమయింది. కొంత కాలము వారు ఆనందాం బుధిని ఓలలాడినారు. చెలు రహస్యమున గ్రహించి "మనమీ విషయాన్ని భూపతికి తెలపకచో ఏమగునో" యని భయపడి విషయమును రాజుకు విన్నవించినారు. మదనాభిరాముడు పుత్రికకు చెప్పవలసినన్ని చెప్పినాడు యామినీ పూర్ణతిలక "తండ్రీ ఆ కవికే న్నిచ్చి పెండ్లి చేయుము. నా మనువు, నా మనసు ఆతనితోనే యుండెనిమ్ము" అని చెప్పినది. మదనాభిరాముడు కొలువు కూటములో "అంతఃపుర ద్రోహము చేసిన వానికి తగిన శిక్ష ఏమి?" అని ప్రశ్నించెను. దండింప వలయునని సభా సదులు చెప్పినారు. రాజు వీరసేనుడను తలారితో" బిల్హాణుని తలను శ్మశానమున నరుకుము" అని చెప్పెను. వీరసేనుడు బిల్హాణుని చేతులు కట్టివైచి శ్మశానానికి కొనిపోవుచుండెను. బిల్హాణుడు ఆ తలారిని అనుసరించెను. యామినికి విషయము తెలిసి రాజు సన్నిధికి పోయి తన భర్తను క్షమింపుమని కోరినది. యామిని దీనాలాపములను తండ్రి వినలేదు. భటులామెను నివారించిరి. తలవరులు బిల్హాణుని శ్మశానములో ఒక మఱ్ఱి చెట్టుక్రింద నిలిపినారు. అపుడు బిల్హాణుడు వీరసేనునితో "వీరసేనా! నా తల నరుకుము" అన్నాడు. బిల్హాణుని తలను నరుకుటకు వీరసేనునికి చేతులాడ లేదు. కత్తి భూమిపై పడవేసి నిలబడినాడు. వధ్య స్థానమున బిల్హాణుడు యామినీ పూర్ణతిలకను శృంగార దేవతగా వర్ణించుచు "చోరపంచాశిక" అను పద్యములు చెప్పినాడు. వీరసేనుడు పద్యములు వ్రాయించి సేవకుల ద్వారా రాజుకు పంపించినాడు. రాజు పద్యములు తెచ్చిన వారిని కసిరి పంపించినాడు. బిల్హాణుడు మరల కొన్ని పద్యములు చెప్పినాడు. వీరసేనుడు వానిని కూడ వ్రాయించి రాజువద్దకు పంపించినాడు. రాజు కోపగించి "నీవిక పద్యములు తీసికొని నావద్దకు రావద్దు. వచ్చినచో నేరముగా తలంపవలసి వచ్చును" అన్నాడు. బిల్హాణుడు మరల ఒక పద్యము చెప్పినాడు. ఈసారి వీరసేనుడే పద్యమును తీసికొని రాజు వద్దకు పోయినాడు. ఆ పద్యము ఇది.

"రవిజుడు ఖా గుడింప విధురంబుగ భట్టినశించె భారవి
ప్రవరు డడంగె దీర్ఘమున ప్రాణము పాసె గుడియ్యె

యవనికి తప్పె భీముడు దదంత గతిన్మతికొమ్ము వెట్టని
కు_వముగ నే భుకుందుడను కొమ్మున దీర్ఘము వెట్ట కుండ డీ
భువి నతడెన్న నిర్దయుడు భూపతి నీవు తలంప భూవరా!"

రాజు ఈ పద్యము చదివి "వీరసేనా! బిల్హాణుని పిలిచుకొని రమ్ము" అన్నాడు వీరసేనుడు బిల్హాణుని వధ్య స్థానము నుండి పిలిచికొని సభాస్థానమునకు తెచ్చినాడు. రాజు బిల్హాణునికి ఎదురేగి నమస్కరించినాడు. "కవిరాజా! నీవు మహిమాన్వితుడవు. నా పుత్రికను పెండ్లియాడి మా నగరమునకు రాజువు కమ్ము" అన్నాడు యమినీ పూర్ణతిలకను బిల్హాణుని కిచ్చుటకు మందారమాలయు సమ్మతించినది. యామినీ బిల్హాణులకు అతివైభవంగా వివాహమయింది. కొంత కాలమునకు యామిని గర్భవతి యైనది కుమారుడు జన్మించినాడు. ఆ శిశువునకు ప్రభాకరుడని పేరు పెట్టినారు. యుక్తవయసున రాజు తన మనుమనికి పట్టము కట్టినాడు. ఇంతటితో కావ్యం ముగిసింది.

కావ్యగత కవితా విశేషములు:-

ఈ కవి పద్యములు అనుప్రాసాలంకార యుత ములై యలరారుచుండును. కథా ప్రారంభము నందలి వనముల వర్ణనము

ఆ వనములు, ద్విజ సందో
హావనములు, తులిత వృత్రహా వనములు స
త్పావనములు, మార్గిక సం
జీవనములు, కలిత భువన జీవనములగున్"-

కథా ప్రారంభమునందు రాజులను వర్ణించిన పద్యము నకు వసుచరిత్ర యందు భట్టుమూర్తి పద్యమునకు చాలా పోలికలు కలవు రెండు పద్యములును సీస ములే.

ఔర? వీరన, వీరనయైక పరులు
పరుగుదురు పురి శుచి భాను వంశ్యులగుట
కువలయానంద సంధాయి గురు తమోప
సరణ నైపుణ్య విభులు రాజన్య విభులు —
(బిల్హణీయము. 1 ఆ 12 పద్యము

"ఔర! వీరన వీరనయైక వరులు
వరలు దురు వీట పుష్పవ ద్వంశ్యులగుట
కువలయాధార కమలానుగుణ విహార
సార సౌజన్యధరులు రాజన్యవరులు —
(వసుచరిత్ర 1 ఆ 98 పద్యము )

రాజును బెదిరించిన పద్యము క్రిందిశ్లోకమునకు అను వాదమనిపించును.

భట్టిర్నష్టః భారవిశ్చాపి నష్టః
భిక్షుర్నష్టః భీమసేనోపి నష్టః
భుక్కుండోహం భూపతిస్త్వంహి రాజన్
భబ్భావళ్యా మంతకః సన్నివిష్టః-

బిల్హణీయము పండితులందరి చేతను ప్రశంసించ బడిన మధురమయిన కావ్యం, సరళమయినపద్యముల నడక, వర్ణనా నైపుణ్యము, శైలి సౌకుమార్యము నిండిన కావ్యము బిల్హణీయము.

26/441 మూలాపేట.
నెల్లూరు-3

# తెలుగుకవుల కవిత్వాశయాలు

కరిమద్దెల నరసింహారెడ్డి

కవి చెప్పేది 'కవిత్వం'. కవిత్వమొక తీరని దాహం మానవపథికుడు చేరుకొనే గొప్ప విశ్రాంతి మందిరం 'కవిత్వం'. కవిత్వాన్ని గురించి ప్రాచ్య, పాశ్చాత్య లాక్షణికులు లక్షలకొలదిగా నిర్వచనములు చేసియున్నారు. వాని నన్నింటిని చర్వితచర్వణము చేయుట ప్రస్తుతము అప్రస్తుతము, తెలుగుకవులు తమకావ్యాలలో అవతారికలయందు, కథలలో అక్కడ క్కడ చెప్పిన పద్యములను ఆధారముగా చేసికొని 'కవిత్వమును' గురించి వారి ఆశయాలను అభిప్రాయా లను వివరించుటయే ఈ వ్యాసానికి ఉద్దేశ్యము.

మొట్టమొదట ఆదికవి నన్నయభట్టారకుడు చెప్పిన పద్యమును గమనింతము. భారతావతారిక యందు నన్నయ

"సారమతింగవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో
నారసి మేలునా నితరులక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబు గన్"-

అని చెప్పినాడు. దీనిని బట్టి నన్నయదృష్టిలో కవిత్వ మనగా "ప్రసన్నమయినకథ యుండవలయును. కథను చెవికి యింపులు నింపు రమ్యమయిన అక్షరములతో చెప్పవలయును." రుచిరములయినసూక్తులను చెప్పవలయును." ఇది స్థూలముగా కవిత్వమును గుఱించి ఆదికవి ఆశయము.

ప్రబంధప్రజాపతి నన్నెచోడకవిరాజు తనకుమార సంభవావతారికలో

"సరళముగాగ భావములు జానుతెనుంగున యింపు పెంపుతో
పిరిగొన వర్ణనల్ వణితిపేర్కొన అర్థములొత్తగిల్ల బం
ధురముగ ప్రాణముల్ మధుమృదుత్వరసంబున కదళింప న
క్షరములు సూక్తులార్యులకు కర్ణరసాయన లీల గ్రాలగన్"—

అని వివరించి యున్నాడు. దీనిని బట్టి నన్నెచోడుని మతమునననుసరించి "భావాలు సరళముగా నుండవలయును. వానిని జాను తెలుగులో చెప్పవలయును. మృదువులయి, మధురములయిన పదములతో పండితులు మెచ్చుకొనునట్లు వర్ణనలు చేయవలయును. అక్షరములు, సూక్తులు ఆర్యులకు కర్ణరసాయనముగా నుండవలయును." అని తెలియుచున్నది. నన్నెచోడును కవిత్వమును గురించి యింకా తన యభిప్రాయాలను ఇట్లు చెప్పియున్నారు. పదునెనిమిది వర్ణనలు, పద ప్రాణములు. నవ రసములు ముప్పది యారలంకారములుండవలయునట.

కవిబ్రహ్మ తిక్కన నిర్వచనోత్తర రామాయణము నందు

"భూరి వివేక చిత్తులకు పోలుననందలపన్ దళంబు నన్
సౌరభమిచ్చు గంధవహు చందమునన్ ప్రకటంబు చేసి యిం
పారెడు పల్కులం బదయన్ అప్పలుకుల్సరి గ్రుచ్చునట్లుగా
చేరుపనేరగావలయు చేసెదనేకృతియన్న వారికిన్"-

"లలితపదహృద్యపద్యం
బులన కథార్థంబు ఘటిత పూర్వాపరమై
అలతి యలతి తునియలకా
హల సంధించిన విధంబు నమరగవలయున్"-

అని చెప్పినాడు. "కవిత్వము" వివేక చిత్తులకు మత్తును కలిగించవలయును. దళములతో అనగా పుష్పములనుండి సువాసననిచ్చు గంధవహునివలె మంచిపదములనుపయోగించవలయును. శబ్దసాగరమునుండి యింపును కలిగించు పదముల నేరుకొనవలయును. ఆ పదముల సరములను గ్రుచ్చినట్లు కూర్చవలయును. లలిత పదములతో నిండిన పద్యముల వలననే కథ ముందు వెనుకలు సరిపోవలయును. చిన్నచిన్న పదములు వాడవలయును" ఇది తిక్కన మతము.

శివకవులలో ముఖ్యుడయిన పాల్కురికి సోమన తన పండితారాధ్య చరిత్రమునందు

"తొమ్మిది రసములు తొలుకాడు దాని
యిమ్మిడి వర్ణన లెసగగ ద్విగుణ
మగు నలంకారంబు లసలారుదాని
ద్విగుణార్ధ భావముల్ దీటుకొనంగ" అని చెప్పినాడు.

"కవిత్వమునందు నవరసము లుండవలయును. పదునెనిమిది వర్ణనలుండవలయును. ముప్పది యారలంకారములుండవలయును." అనునది సోమన మతము. ఆలంకారికులు చెప్పిన విధముగనే చెప్పి "అల్పాక్షర

ముల అనల్పార్థరచన, కల్పించుట్యయకాదె కవివివే కంబు" అని విశేషముగా చెప్పినాడు.

పిల్లలమర్రి పినవీరభద్రుడు జైమిని భారతము నందు

"అల్లనవిచ్చు చెంగలువలందు రజంబను
కప్పురంబుపై
చల్లగ జల్లనై వలచు సౌరభముల్ వెదజల్ల
భావముల్
పల్లవహస్త చన్నుగవ పయ్యెద జిమ్మగ
తోచు భాతిగా
పిల్లలమర్రి వీరన యభిజ్ఞుడు సెప్పగ నేర్చు

అని చెప్పినాడు.

కవిసార్వభౌముడు శ్రీనాధుడు ప్రౌఢదేవరాయలను చూచుటకు పోయినాడు. విజయనగరమునకు చుట్టు ప్రక్కలనున్న రమణీయమయిన ప్రకృతిని చూచినాడు. ముమ్మకవితో తన కవిత్వము ఎట్లుండునో చెప్పినాడు.

"పంపా విరూపాక్ష బహు జటా జూటికారగ్వధ
ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచి ఘటా గంభీర ఘుమ
ఘుమా రంభములకు
కళసాపుర ప్రాంత కదళీ వనాంతర ద్రాక్షాలతా ఫల
స్తబకములకు
కర్ణాట కామినీ కర్ణహాటకరత్న తాటంకయుగ ధాళ
ధళ్యములకు
నిర్నిబంధ నిబంధమై నెనయు కవిత
తెలుగునను సంస్కృతంబున పలుక నేర్తు
ప్రౌఢ దేవేంద్రరాయ భూపాలవరుని
సమ్ముఖమున దయ చూడు ముమ్మసుకవి"

అన్నాడు,

మరియు భీమేశ్వర పురామునందు

"హర చూడా హరిణాంక వక్రతము కాలాంత స్ఫుర
చ్చండికా
పరుషోద్గాఢ పయోధర స్ఫుటతటీ పర్యంక
మున్
సరసత్వంబును సంభవించెననగా సత్కావ్యముల్
దిక్కులన్
చిరకాలంబు నటించుచుండు కవిరాజీ గేహ రంగంబు
లన్" అని చెప్పినాడు. "కవిత్వమునందు వక్రోక్తి చమత్కారము లుండవలయును, పరుషములయిన పద బంధము లుండవలయును. సుదీర్ఘములయిన సమాసము లుండవలయును" అనునది శ్రీనాధుని కవిత్వాశయమని మనము గ్రహింపవచ్చును.

కల్పనా కావ్యధుర్యుడు పింగలి సూరనార్యుడు కళా పూర్ణోదయమునందు కలభాషిణి నారదునితో మాటలాడునపుడు

"పొసగముత్తైపు సరుల్ పోహళించిన తీల తమలోన
దొరయు శబ్దముల గూర్చి
అర్థంబు వాచ్య, లక్ష్య, వ్యంగ్య భేదంబు తెరిగి నిర్దో
షత నెసగ చేసి
రస భావములకు నర్హంబుగ వైదర్భి మొదలయిన
రీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు ప్రాణంబు లింపుగా
పాదు కొల్పి
అమర నుపమాదులును యమకాదులునగు
నట్టి యర్థ శబ్దాలంక్రియలు ఘటించి
కవిత చెప్పంగనేర్చు సత్కవి వరునకు
వాంఛితార్థంబు లొసగని వారు కలరె"

అని చెప్పినాడు.

"శబ్దములు పూసలు గ్రుచ్చినట్టుండవలయును, వాచ్యము, సూచ్యము, లక్ష్యము అర్థములుండలవ

యును. రసభావముల కనుకూలములయిన వైదర్భి మొదలయిన రీతులుండవలెను. రీతుల కుచితములయిన ప్రాణములుండవలెను. ఉపమాదులయిన అర్థాలంకారాలు, యమకాదులయిన శబ్దాలంకారములుండవల వలయును" అనునది కవిత్వమును గురించి సూరన అభిప్రాయము. ఇట్లే ప్రభావతీ ప్రద్యుమ్నము నందు దేవేంద్రుడు శుచిముఖిని ప్రశంసించునపుడు

"శబ్దసంస్కార మెచ్చటను జారగనీక, పదమ్మైత్రి
యర్థసంపదల పొదలన్
తలపెల్ల నక్లిష్టతను ప్రదీపితముగా, పునరుక్తి
దోషంబు పొంత పోక
ఆకాంక్షితస్ఫూర్తి యాచరించుచును, శాఖాచంక్రమ
క్రియ కడవ జనక
ప్రకృతార్థభావంబు పాదుకొనదుకుచు, నుపపత్తి
యందూ నత్యూర్జితముగ

ఒకట పూర్వోత్తర విరోధమొదవకుండ
తత్త ధ్వనయవ వాక్య తాత్పర్య భేద
ములు మహావాక్య తాత్పర్యమునకు నొనర
పలుకనేర్చుట బహుతపః ఫలముకాదె"

అన్నాడు.

"శబ్దముల సంస్కారమును కల్గియుండవలయును. వ్యర్థపదాలుకాక అర్థవంతములయిన పదములుండవల యును. భావప్రకటమునందు క్లేశముండరాదు. పునరుక్తులుంటకూడదు. శాఖా చంక్రమణముండరాదు." అనునది సూరనార్యుని కవితాశయము. సూరనచెప్పిన రెండు పద్యములవలన కవిత్వము ఎట్లుండ వలయునో తెలియుచున్నది. సూరన కవితాకళా పూర్ణుడుకదా!"

కవయిత్రి మొల్ల "కవిత్వము" ఎట్లుండ వల యునో తనరామాయణమునందు వివరించినది.

"వలిపపు సన్నపయ్యెదను వాసిగ గంధపు పూత
తోడుతన్
కొలదిగ కానవచ్చు వలిగుబ్బ చనుంగవ రీవినొప్పుగా
తెలుగని చెప్పుచోట కడు తేటల మాటల క్రొత్త
రీతులన్
పొలుపు వహింపకున్న మరి పొందగునే పటహాది
శబ్దముల్-"అనిచెప్పినది.

"కవిత్వము వాచ్యముగా కాకుండ ధ్వనిమంతముగా నుండవలయును. పాతరీతులలో కాక నూతనమయిన రీతులతో చెప్పవలయును" అమె ఆశయము. మరియు

"తేనెసోక నోరు తీయన యగురీతి
తోడనర్థమెల్ల తోచకుండ
గూఢ శబ్దములను కూర్చిన కావ్యమ్ము
మూగ చెవిటివారిముచ్చటగును"-అనిచెప్పినది.

"తేనె సోకిన వెంటనే నోరంతయు తీయనగును. అట్లే చదివిన వెంటనే పద్యమంతయు అర్థము కావలయును. అందువలన గూఢములయిన పదములను వాడవలయు నేకాని గూఢములయిన పదములను వాడరాదు. గూఢ ములయిన పదములతో రచించిన కావ్యము మూగ, చెవిటివారి ముచ్చటవలె యుండును" ఇది మొల్ల కవితాశయము.

రఘునాథకుడ వాల్మీకి చరిత్రమునందు కవిత్వ మును గురించి చెప్పిన పద్యములను గమనింపుడు.

"చెప్పవలె కప్పురంబులు
కుప్పలుగా పోసినట్లు కుంకుమపైపై
గుప్పినక్రియ విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభల"

చెవులకు చవులై చల్లగ
కవులకు తవులై సమస్తకావ్యకళా బం
ధువులై రస సింధువులై
యవురా! యన కవితలవని నలరగ వలదా!

"కప్పురము కుప్పలుకుప్పలు పోసినట్లుగా, కుంకుమ మీద మీదిన గుప్పించునట్లుగా, పువ్వులపొట్లము విప్పి

నట్లుగా ఘుమ ఘుమలాడునట్లు కవిత్వము చెప్పవలయును. సరళముగా, సుందరముగా, మృదువుగా మధురముగా చెప్పవలయుననునది భావము. చెవులకు యింపులు సింపవలయును. కవులకు అందాలబంధాలు కావలెను. కావ్యకళకు బంధువులు, రసమున్నకు సింధువులు కావలయును. అందరును ఆశ్చర్యముతో ఔరా! యనునట్లు కవిత్వము చెప్పవలయునట" ఇది రఘునాథరాయల కవిత్వాశయము.

బైచరాజు వేంకటనాథుడు. ఇతడు పంచతంత్రమును రచించినాడు. దూబగుంట నారాయణకవికి కొంచెము తరువాతివాడు. పంచతంత్రమునందు "కవిత్వము" అనునది ఎట్లుండవలయునో చెప్పుచున్నాడు.

"ఘనతర ఘూర్జరీ కుచయుగక్రియ గూఢముగాక ద్రావిడే
స్తనగతి తేటగాక అరచాటగు నాంధ్రవధూటి చొక్కపున్
జనుగవ పోలె గూఢమును, చాటు దనంబునుగాక యుండ చె
చెప్పినయదెపో కవిత్వమనిపించు నగించటుగాక యుండినన్"-

"కవిత్వము" ఘూర్జర యువతల కుచములవలె గూఢముగా నుండకూడదు. ద్రావిడ యువతుల స్తనములవలె తేటగా వుండకూడదు. అరచాటుకలిగ ఆంధ్ర యువతుల కుచములవలె యుండవలయును. అంత గూఢముగా నుండకూడదు. అంత సులభముగానుండ కూడదు. నాతి కఠినము, నాతి సులభముగా నుండవలయును." ఇది కవిత్వమును గూర్చి వేంకటనాధుని ఆశయం.

కొఱవి గోపరాజు గారు "సింహాసన ద్వాత్రింశిక" అను కావ్యమును రచించినాడు. స్వతంత్ర కావ్యమును రచించుట కంటె అనువాదము చేయటమే కష్టమని చెప్పినాడు. "అనువాదము కత్తిమీదసాము" అన్నారు కదా! అనువాదము చేయుటకు ఎక్కువ నేర్పు కావలయునట. ఎట్లనగా "విలుకాడు తూటుగా నేసిన నందె పాఅమతి యేసిన వానిద సూటి కావునన్" ఇతడు సింహాసన ద్వాత్రింశికలో కవిత్వమును గుఱించి

"తెనుగున తేటగా కథలు తెల్పిన కావ్యము పొందు లేదు మె
త్తన పస చాలదంద్రు విశదంబుగ సంస్కృత శబ్ద మూద చె
ప్పిన నవి దర్భ ముండ్లనుచు పెట్టరు వీనుల కావ్యన్ రుచుల్
తనర తెనుంగు దేశియును తద్భవమున్ కలయంగ చెప్పెదన్" అని

చెప్పినాడు. 'తెలుగు భాషయందు తేటగా కథలు చెప్పినచో కావ్యములో పొందిక లేదు. మెత్తగా నున్నది పస చాలలేదు." అంటారు. సంస్కృతములో చెప్పినచో తర్భముండ్లవలె నున్నదందురు. వినుట కిష్టపడరు. అందువలన దేశి- తద్భవమును చెప్పెదను" ఇది గోపరాజు గారి కవితాశయం.

ప్రౌఢకవి మల్లన "రుక్మాంగద చరిత్రము" అను నామాంతరము కల ఏకాదశీ మహాత్మ్యము" అను కావ్యమును రచించి భీమేశ్వరస్వామికి అంకితము యిచ్చినాడు. కవిత్వమును గురించి రుక్మాంగద చరిత్రలో చెప్పినాడు.

"సౌరభ్యంబును, బంధదాతురి తగన్ శయ్యా చమత్కార శృం
గారంబును, వివిధార్థముల్ సరససాంగత్యంబు నానా కళా
పారీణత్వము మంజు వాగ్విభవమున్ పాంచాలరీతిం దగన్
వారస్త్రీయును పోలె నొప్ప వలదా వర్ణింప కావ్యంబిలన్"
"నానుడును శృంగారము, నానావిధ వృత్త వర్ణనలు సంపూర్ణం

బయి నిల్చిన కృతి సత్కృతిగా నుతియింతురు కదా
సుకవులయ్యెడలన్
జాజుల పొట్లము విప్పిన యోజ కవిత్వంబు వెలయ
కుండిన సభలన్
పూజింతురె? యాకృతి బుధ రాజులును సుకవిరాజు
లును గరిమన్"

"సువాసన, బంధ చాతుర్యము, శయ్యా సౌభాగ్యము, చమత్కార శృంగారము' సరససాంగత్యంబు మంజుల వాగ్విభవము వుండవలయును. నానుడులు, వర్ణనలు, వుండవలయును. జాజుల పొట్లము విప్పిన విధముగా కవిత్వముండవలయును. అట్టిదానినిసత్కృతియందురు. దానిని బుధరాజులు, సుకవిరాజులు మెచ్చుకొందురు. లేనిచో నొచ్చుకొందురు" ఇది కవిత్వమును గురించి మల్లన మతము.

మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రమును రచించినాడు. ఇతను కవిత్వమును గూర్చి కుకవి నిందా సందర్భమున

"గాఢార్థ ప్రతిపాదన క్రమకళా కౌశల్యముల్లేక వా
చా ఢక్కార్భటి తోడ తామతము మజ్ఞాయించు కైవా
రముల్
ప్రౌఢిన్ చేయుచు ప్రాజ్ఞులన్ నగుచు గర్వగ్రంథులై
యుందు న
మ్మూఢ స్వాంతులు మెచ్చకుండుటయు సమ్మోదంబు
మా కొంట్లకున్"

"కవిత్వము నందు గాఢార్థ ప్రతిపాదన క్రమ కళా కౌశిల్య ముండవలయును. వాచాలత్వముండ కూడదు. కవిత్వము నందు నిబ్బరముండవలయును. రసవంతముగా నుండవలయును." ఇది మల్లన కవిత్వాభిమతము.

రాధా మాధవకవి తన కవితా మాధుర్యమును గురించి

"సరసులు చిత్తగింపుడని చాటను మామక వాణి
సన్మనో
హర యగునేని వారి హృదయంబుల కింపొనరింప
కున్నె యె
వ్వరు పిలువంగ వచ్చి మధువర్గము లాత్మల చొక్క
తేనియల్
కురియు ప్రసూన గుచ్ఛభరకుంచిత మల్లి మతల్లికా
వనిన్"

"నా కవిత్వమును గురించి నేను చాటింపు వేయను. నా కవిత్వము మనోహరమయినచో అదే సహృదయుల హృదయములనలరించును. ఎవరు పిలువగా వచ్చి తుమ్మెదలు మకరందమును పానము చేసి ఆనందము ననుభవించుచున్నవి " కవిత్వమును మనోహరముగా రచించినచో సహృదయులు వారే ఆదరించెదరు. మనోహరముగా రచించిక నా కవిత్వము బాగుందని చెప్పి సహృదయులను పిలువకూడదు" అనునది యితని మతము.

అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయము నందు వర్షాకాలమును ప్రబంధముతో పోల్చి తన కవిత్వాశయములను చెప్పక చెప్పినాడు.

"ధారాశుద్ధి ప్రసిద్ధిగాంచి ఘన శబ్దస్ఫూర్తివ ర్తిల్లగా
తోరంబయిన రసస్థితిన్ తరళ విద్యున్మాలికా లక్షణో
దారంబయి ఘనసేవ్యమౌ వనమయూరా రూఢి
ప్రాపించి వ
ర్షారంభంబు ప్రబంధ మట్లఖిల పద్యాక్రాంత మయ్యెం
దగన్."

ధారాశుద్ధి, శబ్దస్ఫూర్తి, తోరంబయిన రసస్థితి అనునవి యుండవలయును.

శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము నందు కవిత్వమును గురించి

"వడియును ప్రాసమున్ వెదకు వాడు ప్రబంధము
పూని యేమి చె

ప్పెడి నగుబాటగున్ సుకవి బృందము ముందట
మాటలాడు వెం
బడినవి తమ్మ తామె సులభస్థితిలో నుచిత స్థలంబునన్
పడిపడి వచ్చి విర్చి బహు భంగుల త్రోవల చూప
కుండినన్"

వడి కొఱకు వడి పడువాడు. ప్రాసము కోసము ఆస పడువాడు కావ్యము రచించుటకు పూనుకొనినచో సుకవి బృందము ముందట నవ్వుల పాలగును. ఎట్ల మాటలాడుదుమో అట్లే పదములు, పాదములలో వచ్చి చేరవలయును. మనము కోరకముందే మన ప్రయ్నము లేకుండనే పదములు అహమహమికతో తహతహలాడుచు వచ్చి చేరవలయును. కవిత్వము సహజముగా హృదయపు కట్టలు తెంచుకొని పురవళ్ళు పరవళ్ళు త్రొక్కుచు రావలయును ప్రయత్న పూర్వకంగా రాయకూడదు. అది కవిత్వముకాదు. నిర్బంధ కవిత్వము నిర్గంధకుసుమము" అనునది కవిత్వమును గురించి శంకరకవి మతము.

ఈ విధంగా కవులు తమ కావ్యాలలో కవిత్వమును గూర్చి తమ ఆశయములు. అభిప్రాయములు వెలువరించినారు, తమ ఆశయములకు అనుగుణముగా కవిత్వమును చెప్పియున్నారు-

20/441, మూలాపేట
నెల్లూరు

# రాయప్రోలు- అవ్వారి కవుల విద్యాయాత్రలు

— అవ్వారి వాసుదేవశాస్త్రి

'ఆచార్య' రాయప్రోలు సుబ్బారావుగారీ నడుమ 30-6-84 తేదీన నంతిమయాత్ర సాగించుట సారస్వత పథికలోకమునకు నెంతయో తీవ్రవేదనను గలిగించినది. అప్పుడు నేనాంధ్ర దేశములో లేకుండుటం జేసి నాకాలస్యముగా వార్తయంది, యేమియు వ్రాయలేని స్థితిలోఁ బడినాను. అప్పుడు సూరంపల్లి భాస్కరరావుగారాంధ్రజ్యోతిలోను, ఆంధ్రపత్రికలో డాక్టర్ సి. నారాయణరెడ్డి, ఆంధ్రపత్రికా ప్రతినిధి దేవులపల్లి రామానుజరావు, తిరుమల రామచంద్ర, పోతుకూచి సాంబశివరావుగారలు వారిని గూర్చి వ్యాసములు వ్రాసియున్నారు.

ఇంకను ఆంధ్రప్రభలోను ఇతర పత్రికలలోను జాలవ్యాసములు వచ్చియున్నవి. కాని నా దృష్టిలోనికి వచ్చిన సూరంపల్లి భాస్కరరావు, పి. రమాదేవి గారలచేతను, 7-12-84 తేదీన ఆకాశవాణిలోఁ బ్రసంగించిన శ్రీమతిప్రజ్ఞాగారి, చేతను అసంస్పృష్టములైన విషయములనే ప్రతిపాదించుచు, .రాయప్రోలు వారు స్వయముగానాకందఁ జేసిన కొన్ని విషయములనిందు వారియాజ్ఞానుసారము చేర్చుచు, అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి రాయప్రోలు సుబ్బారావుగారల విద్యాయాత్రలు నుదాహరించుచు ఆ యాత్రలలోని. కవితావిశేషములను

ముఖ్యముగా నీ వ్యాసములోఁ బాఠకలోకమునకుఁ దెలుపుటయే యిప్పటి నా ధ్యేయము.

## జననస్థలము-దాని ప్రాశస్త్యము

'గార్లపాడు' ఆచార్య రాయప్రోలు వారిజన్మస్థానమని ఆంధ్రపత్రికా ప్రతినిధిగారాంధ్ర పత్రికలో 30-6-1984 తేదీన వ్రాసియున్నారు. కాని యిచటఁ గొన్ని విశేషముల నుగ్గడింపవలసియున్నది. వారి మాతామహస్థానము 'గార్లపాడు' అనుటలో సందేహములేదు. వారి బాల్యజీవితమంతయు నిచటఁగడచిన మాటయు వాస్తవమే. కాని యభిజనగ్రామము మాత్రమియ్యదిగాదు. కాని యిచ్చట జన్మించి యిచ్చటనే యుపనీతులై విద్యాబుద్ధులం బడసి యిటనుండియే కవితాయాత్ర సాఁగించి యుండుటచే నీ గ్రామమే స్వగ్రామమనవచ్చును. జన్మ, ప్రాథమికవిద్య, బాల్యక్రీడలు మున్నగునవి జరిగిన గ్రామము, నివేశనస్థలము గలిగిన యూఋనగుటచే దీనిని వారు జననీజన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ అన్నట్లు అత్యధికముగఁ బ్రేమించెడివారు ఈ విషయమువారి వాక్యములతో ముందుఁ గొంతతేటపడఁగలదు. నేను బేర్కొనఁబోవు కవిద్వయమును నేడెనిమిది యేండ్లతేడాతో నీ యూఋనే జన్మించిరి. ఇట్టి కవులు కారణజన్ములుగాన వారిజన్మభూమిలో విశేషములుండి తీరును. ఆయా విశేషములఁ దెలుపుటకు జాలవిస్తృతి గావలయును. గాన వానిని గూర్చి బహుళముగా వివరించుటకై వానినట్లె యుంచి సుబ్బారావుగారి కవితాప్రాదుర్భావమును ముందుగాఁ దెలిసికొందము.

## కవితాభ్యాసము

ఆం     ్యతి సచిత్ర వారపత్రిక (13-7-84సంచికలో) పి. రమాదేవిగారిట్లు వ్రాసియున్నారు.

"భావకవిత్వం తొలిదశలోనూ, బాలాకాలం వరకూనూ ఛందోబద్ధంగానే (ప్రధానంగానే) రాయప్రోలు వారి కవిత్వం నడిచింది. కొన్నిగీతాలూ, కూడా వారే రచించడం జరిగింది. భాషకూడా వ్యావహారికవైపు మళ్లినా కావ్యభాషమీద ఆదరం తగ్గలేదు. దీనికి కారణం వారు తమ రచనా వ్యాసంగ ప్రారంభదశలో శ్రీ ఆవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారితో కలిసి చేసిన సంప్రదాయరచనలే. అయినా చెళ్లపిళ్లవారి పద్యధోరణివేరూ, భావకవుల పద్యధోరణివేరూ అని స్ఫురించకమానదు."

1978లో నేను వారితో మాటలాడినపుడును వారి మాటలు వినఁగా వినఁగా వీరికి సంప్రదాయ కవితపై మక్కువ యెక్కువా? అనిపించినది.

కావునవారి రచనా వ్యాసంగ ప్రారంభదశలో అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారితో ఎట్లు కలిసి చెప్పినారో వారి మాటలతోనే వివరించెదను.

"తరువాత శ్రీశాస్త్రిగారు ఆశుకవితాకలాపం ప్రారంభించారు. గార్లపాడు చెరువుకట్టమీద వృద్ధవట వృక్షమున్నది, ఇప్పటికీ కూడా, ఆ చెట్టు చల్లని నీడలలో ఆశువుగా వాచాధోరణి సాగింది. నన్ను పిలిపించి వెంట ఉండమన్నారు. అక్కడక్కడ 'అందుకోరా' అనేవారు. ఏదో నేను గూడా అనుసరించేవాడిని"

## కవితాయాత్రలు

ఇట్లు వారి కవితా వ్యాసంగము ఆశుకవితాభ్యాసమును ఆరుంభమైనవి తరువాత వాని నాచరణలోనికిఁ దెచ్చిన వృత్తాంతమునిట్లు వ్రాసిరి.

"తరువాత శ్రీశాస్త్రిగారు అవధాన-ఆశుకవితా దీక్షతో బయలు దేరిరి. నన్ను వెంటరమ్మన్నారు. మొట్టమొదట కావలిలో దిగినాము. అక్కడ అష్టావధానం జరిగింది. మరునాడు ఆశుకవితా సభ కూడా సమకూర్చారు సహృదయులు. ఒక సువర్ణ పతకముతో 'కవితిలక' అనే లాంఛనమిచ్చి బహూకరించారు.

అక్కడనుండి నెల్లూరు వెళ్ళాము, శ్రీ తూములూరి శివరామయ్యగారి యింట మా విడిది. దాదాపు మూడు నాలుగు వారములు దినవిందుగా ఎనాటి చుట్టరికమో జరిగినది. నెల్లూరిలో అవధానసభ. ఆశుకవితా సభ రెండుగా జరిగినవి. ఆశుకవితా సభకు శ్రీవావిలికొలను సుబ్బారావుగారు అధ్యక్షత వహించారు. "ప్రభావతీ ప్రద్యుమ్నము" ఆశువుగా చెప్పమన్నారు. అది ఆశువుగా చెప్పమన్నారు. అది ఆశువులో రక్తికట్టుతుందా? క్లిష్టకల్పనకు, అక్లిష్టకల్పన కుదిరింది ఆ కావ్యంలో ఆ ప్రగల్భ వృత్తాన్ని శతపాదిగీతాలతో లాగిపారేస్తే బాగుంటుందా? అసలుమాకు మనసు వస్తుందా? సభ నీరసంగా ముగుస్తుందని శంక తగిలింది. నాకు కోపం వచ్చింది శ్రీశాస్త్రిగారు ధ్యానాదికం జరిపి నెల్లూరి రసిక జనానికి స్వాగతపద్యాలు చెప్పుతున్నారు. ఇంతలో నేనీ పద్యం చెప్పాను.

పింగళి సూరనార్యుని కవిత్వమె మిక్కిలి ప్రౌఢ మందులో
నంగడుసుందనంబులు పెనంబడఁగా రచియించె నీ ప్రభావతీ
మంగళ సూత్రధారణము మంజువచో మధురార్థ కల్పనా
సాంగములైన కావ్యములు సాధ్యమె పాడఁగ నాశు ధోరణిన్

లేచియిది చదివాను. సభసందడించింది. మహాకవి (వావిలికొలను సుబ్బారావుగారు) గణుంపోయిఉన్నారు. హఠాత్తుగా శాస్త్రిగారందుకొని

పింగళి సూరనార్యుని కవిత్వమె మిక్కిలి ప్రౌఢమందులో
సంగడు సుందనంబులు పెనంబడఁగా నడిచెన్ ప్రభావతీ
మంగళసూత్ర ధారణము మంజురసోచిత కల్పనాకథా
సాంగములైన కావ్యములు సాధ్యమె పాడఁగ నాశు ధోరణిన్

అని అద్భుత ధారణతో (ఏక సంధాగ్రహణశక్తితో) చదివారు. సభలో హర్షం ధ్వనించింది. (ఇది అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి ఏకసంధాగ్రహణ చాతురికి ఛందోబద్ధపద విపరిణామశక్తిని ఉదాహరణముగా సుబ్బారావుగారు పేర్కొన్నారు.)

రెండవది

"జనను సుబ్బరాయఁడు మహాకవిచంద్రుఁడు చెప్పు మంచు, నా
జ్ఞానిగళంబు మాగళమునన్ దగిలించెనుగాన నాంధ్రభా
షానవనీతకోమల కషాయకుహూకుహూ కాకవీకల

వఱకు వచ్చింది, ఆగిపోయింది సమాసం. శాస్త్రిగారు

"స్వానములీ సభాసదుల భావములన్ దనుపంగఁ బల్కెదన్"

అని పూరించారు.

కావలిలోని అష్టావధానసభలో దుష్కరప్రాసముతో దుఃఖముగాదె చక్కని వధూసురతంబిది బ్రహ్మచారికిన్ అని సమస్యయిచ్చి పద్యం పూరించమన్నారు. శాస్త్రిగారు "కఃఖలు రక్తియందును పికప్రకరంబులు వాదులాడ" అని ఎత్తుకున్నారు. రెండవపాదంగూడా "తేజఃఖనియై" అని నడిపారు. నేను "వసంతుఁడు ప్రసన్నముగా విహరింపమానసాంతః ఖగరాజముల్ స్మరునిగాథలు త్రవ్వగ" అన్నాను. "ముక్తసర్వతో దుఃఖముగాదె చక్కనివధూసురతంబిది" అని పూరించారు. మొత్తముమీఁద పద్యమిట్లు వచ్చినది.

కఃఖలు రక్తియంచును బికప్రకరంబులు వాదులాడదే
జఃఖనియై వసంతుఁడు ప్రసన్నముగా విహరింప మానసాం
తఃఖగరాజముల్ స్మరుని గాథలు త్రవ్వఁగ, ముక్త సర్వతో
దుఃఖముగాదె ! చక్కని వధూసురతంబిది బ్రహ్మ చారికిన్

దీనికి సభ చాలా మెచ్చుకున్నది.

నెల్లూరినుండి బుచ్చిరెడ్డిపాలెము వెళ్ళాము. అవధానసభ అత్యంత జయప్రదంగా జరిగింది. మరునాడు ఆశుకవిత్వ సభలో నేను మూర్ఛపడడంతో ఆశాభంగం కలిగింది." [అక్కడనే కామేశ్వరిని గూర్చి "జననీ! యేమిటికింక ఆశుకవితా సన్న్యాసమిప్పింపవే" అనే పద్యం నేను వ్రాశాను.] తరువాత తిరిగి యింటికి వచ్చాము. ఈ యాత్రలో నాకు గలిగిన మహత్తరలాభం-ఉత్తరరామచరిత్ర వారి పాఠం నాకు లభించింది. అనంతరం వారు సికింద్రాబాదు వెళ్ళారు. సికింద్రాబాదులోనే వారి అవధానాదులు అఖండంగా జరిగినవి."

"రసమో, భావమొ, జీవదర్థసుకుమారవ్యంజనా మంజుళ
ప్రసమాసారచనంబొ,సాధుహృదయస్పంద ప్రతిష్ఠా కథా
విసరంబో, సకలార్థశూన్యమగు నీవేగాతివేగోక్తి దు
ర్వ్యసనం బేటికి? త్రిప్పుమింక జననీ! రమ్యాక్షర శ్రోణికిన్

అని శారదను ప్రార్థించి, ఆశుకవితావధాన వినోదాలకు స్వస్తిచెప్పి కొత్తదారి తొక్కారు" అని బి. వి. సింగరాచార్య గారు రాయప్రోలువారి ఆంధ్రావళి, జడకుచ్చులు అనుగ్రంథముయొక్క ఉపోద్ఘాతములో వ్రాసియున్నారు.

రాయప్రోలు వారికి బుచ్చిరెడ్డి పాలెము సంచారములో జరిగిన విశేషాలను గూర్చి యింకనుగొన్ని వ్రాయవలెనని యున్నది. అందుచేతనే 6-9-1977 తేదీన నాకు వ్రాసిన లేఖలో నిట్లువ్రాసిరి.

"నీవు వ్రాసిన వుత్తరం అందింది. అరవైయేండ్ల నాటి వృత్తము బాగా జ్ఞాపకం వచ్చింది. గార్లపాటి బాల్యజీవితం మనస్సును కదిలించింది.

నాకు రెండు ఏండ్లుగా ఆరోగ్యం బాగాలేదు. కాని నిష్క్రమణం కూడా అంతకంతకు ముందుకు పోతున్నది. బయటికి వెళ్లడం లేదు. ఉత్తరం వ్రాయడం కూడాలేదు... ఇప్పట్లో సాహిత్యకాంక్ష తక్కువ. అయినప్పటికిని శ్రీశాస్త్రి గారిని గూర్చి వ్రాసేయెడల అందులో ఈ క్రింది విషయాలు అనుసంధించు. ఎక్కడాలేదు "

అని కావలి అవధాన విషయము, నెల్లూరి ఆశుకవితా వృత్తాంతమును వ్రాసి

"వ్రాయలేను, ఓపికలేదు. చూపుగూడా సరిగా లేదు. గార్లపాటిలో వర్తమానస్థితిలో నున్న మనవీథిని గూర్చివ్రాస్తే తెలుసుకొని సంతోషిస్తాను" అని వ్రాసిరి.

నేను వారికిఁగావలసిన విషయములు వ్రాసి పంపుచు అంతతో విడువక స్వయముగా సికిందరాబాదులో మారేడుపల్లిలో మామిడిచెట్టుపైనుండి కోకిలస్వామి స్వాగతమిచ్చుచున్న వారి స్వగృహానికి వెళ్ళి కొన్ని విషయాలు వారు స్వయముగా చెప్పఁగా సేకరించుకొని వచ్చితిని. అప్పుడే నన్నువారి యింటనే యుంచుకొని తమ రచనలన్నియునిచ్చి ఆర్థికముగాఁ గూడ సత్కరించి వాత్సల్యముతో వీడుకొల్పిరి.

నెల్లూరులో జిల్లాలోని బుచ్చిరెడ్డి పాలెము వెళ్ళినప్పుడు తమ్ముఁబరిచయము చేసికొనుచు నిట్టి పద్యములు చెప్పితిమని మచ్చునకుఁగొన్ని పద్యములు సమగ్రములు నసమగ్రములునైనవి గుర్తున్నవి కొన్ని చెప్పిరి. ఆ వయసులో వారి జ్ఞాపకశక్తికి నే నచ్చెరువందినాను.

(1) - - - -

గార్లపాదను గ్రామమ్ము గలదొకండు
వేదశాస్త్ర పురాణ కోవిదుల యిండ్లఁ
బుట్టి పెరిగియు శిక్షణ పొందినాము
కలదు సంస్కృతాంధ్ర కవిత్వ కౌశలమ్ము
మూవ చక్రపురమ్ము మాదిరెడ్డి!

## పెద్దల ఆశీస్సులు

తిరుపతి వేంకట కవులలో నొకరైన చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు 'లలిత' యను వీరి గ్రంథమునకు పోద్ఘాతము వ్రాయుచు నీయన కవిత్వము లలితపద భూయిష్ఠమై నిర్దుష్టమై యుండుననుటకీ చిన్నపొత్తమే సాక్ష్యమిచ్చును. గాన విశేషించి వ్రాయనక్కఱ లేదు. ఈ పద్యములను సంస్కరింపుడని నా యొద్దకుఁ బంపెను గాని నాకిందు సంస్కరింపఁదగిన యంశములంతగాఁ గనుపట్టలేదు, హూణకలాభ్యాసమొనర్చు విద్యార్థులలో నిట్టి నిర్దుష్ట కవిత్వశైలి కడునరుదుగా నుండునని తలఁచెదను.... ఈ సుకవికి నానాఁట సరస కవితా దరమభివృద్ధి చెందునట్లొనర్పవలయునని భగ వంతునిం బ్రార్థించు చున్నాఁడనని రాయప్రోలు వారి నాశీరఁదించిరి.

కింకపీంద్రఘటా పంచాననులైన చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి యాద్యశిష్యత్రయములో మొదటివారు వీరితో సంచారము చేసిన ఆవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు వారు తమ గురువుల వలన లభించిన పాండిత్య కవిత్వాదిశక్తిని సికిందరాబాదు శతావ ధానములో ఆరంభమున నిట్లుగ్గడించి యున్నారు.

సిరులెశఁగంగ ధారవిలసిల్లఁగ ధారణ మెండుగాఁగ నె
వ్వరి పద పద్మ పాంసువులు భావమునందుఁ దలంచు చుండువ్యా
కరణముఁ జెప్పి సత్కవిత కైవసమై తగఁజేసిరెవ్వరా
తిరుపతి వేంకటేశ్వర సుధీవరులన్ గురులన్ దలంచెదన్.

ఇట్టి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు రాయప్రోలు వారిని సహకవులుగా గ్రహించి యాదరించి యాశీర్వదించిన విషయమెల్లఱకును విశదమే.

ఇఁక రెండవవారగు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు (విమర్శక శిరోమణులు) తమగురువులను గూర్చి యిట్లు చెప్పుకొనిరని రాయప్రోలు వారే నాతోఁజెప్పిరి.

"వేంకటశాస్త్రి పండిత కవి ప్రభు పాదములాశ్ర యించి ని
శ్శంకముగా గడిచితిమి శక్త్యనుసారము సంస్కృ తాంధ్ర కూ
లంకష పాండితిన్ కవనలాఘవమున్......

ఇట్టి ప్రభాకర శాస్త్రి గారు దిగువగా నుదహరింపఁ బోవు రాయప్రోలు వారి పద్యమును బాగుగా మెచ్చు కొని యాశీర్వదించిరఁట.

ఆవర్చస్విని ముద్దుమోముపయి తీయంబైన లజ్జాలతల్
పూవుల్ బూయ విసాళినవ్వు చిగిరింపన్ లేఁత చెక్కిళ్ళపై
కోవల్దీయ రహః ప్రదేశమున నాకు న్నేరిపెన్ ప్రేమ వీ
ణా వాదంబది మాననేమిటికొ? సౌందర్యార్చనల్ దోసమో!

ఇఁక దిరుపతి వేంకటకవుల మూఁడవ శిష్యులైన శతావధాని వేలూరి శివరామ శాస్త్రి గారు మొన్న మొన్నటివరకు సమకాలికులు గావున నెన్నిదీవన పూవులతోనో రాయప్రోలు వారి నభిషేకించి యుందురు.

శ్రీ సుబ్బారావు గారు దేశమంటే మట్టిగా దోయ్ అనుగేయమును దామిట్లు చెప్పినట్లుగా నుడివిరి.

దేశమంటే మట్టిగాదోయ్
దేశమంటే తెలుగు గడ్డోయ్
లు
కాదు కాదోయ్ గండు మగలోయ్.

ఇఁక ఆశుకవిత్వమును గూర్చి తమ అభిప్రాయమును ఒక రెడ్డి గారితోనో యేమో యిట్లు చెప్పినామన్నాడు.

కొపరంపుంగవిచంద్రులాశు కవితా గోష్ఠిన్ నినున్ దన్నఁజా

జక్కవ బంగారపు గంటవిచ్చితని మ్రోగన్ వింటి వాగర్థయో
గపుటీ బంధముగాదె కావ్య. మిట శృంగారాది నానారస
వ్యపదేశంబుల నించియూంచవలెనీ వాదంబు బోనాడుచున్
విపరీతానిల ధోరణింబ్రిబడినచో విధ్వంసమై పోదె యీ
కపురంపుంబలుకుల్ తెలుంగు పలుకుల్ కావ్యాత్మలే కున్నచో
విపరీతంబును మెత్తురే రసికులుర్విన్!......."

ఇట్లు మత్తేభ మాలిక సాఁగినది,

కావుననే అనఁగా ఆశుకవితలో రసభావాదు లగ్గముగా నుండవనియె వీరు కొంతకుఁగొంత, ఆశు కవితా సన్న్యాసమిప్పింప వేయనిఆశు కవితను వదలి వేసి కావ్యకవితలోనికి వచ్చినారేమో! యనిపించును.

మఱియు ఆశుకవితలో దిట్టలై 'ఆశుకవి తిలక' 'విద్వదాసుకవి' అని బిరుదములు పొందిన వీరి సహకవులు ఆవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి గారును సికిందరాబాదులో" ఈ ఆశుకవిత్వ ప్రక్రియ మా గురువుల కిష్టము లేనిదని శతావధానము చేయిలంపుఁడ" నియుఁ జెప్పినట్లు సికిందరాబాదు శతావధాన పీఠికలో చివుకుల అప్పయ్య శాస్త్రి గారు వ్రాసిరి, తరువాత నొకపరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ యాశుకవితను ఆపివేసి దానిలో మిగులునదేమియు నుండదు గాన "నాదంతయు తుషాన్నమయి పోయినదండీ" యని 'కవితా భూషణ పెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారితోఁ జెప్పినట్లు వారివలనే నాతోఁజెప్పిరి. ప్రకృతమునకు వత్తము :-

మన యీ కవులు సంచారములో నున్నప్పుడొకరు పుల్లి విస్తరాకుపైఁ గవిత్వము చెప్పుమన్నారఁట. మన యీ కవిద్వయమంగీకరించి నారే కాని కాదనలేదు. ఇదియేమి కావ్యవస్తువనలేదు. పద్యములు చెప్పిరి. అదియేగదా! సహృదయత. కవులకది యుక్తమే. అందుకనియే దశరూపక కర్తయైన ధనికుఁడిట్లు చెప్పియున్నాడు.

"రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీ చ
ముగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు।
యద్వాప్యవస్తు కవిభావక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావముపైతి లోకే"

(మనోహరమైనది గాని రోతపడఁదగినది కాని గొప్పది గాని నీచమైనది గాని భయంకరమైనది గాని ప్రసన్నమైనది గాని ప్రవేశింపదానిది గాని వికారముతోఁ గూడినది కాని కవితాయోగ్య వస్తువు గానిది గాని కావ్యవస్తువు కానిది కాని ఏదయినను చక్కని భావనా బలముగల నక్కవుల చేతిలోఁ బడినచో రసముగా మారి సహృదయులనా వర్ణింపని విషయమే యుండదు.

కావున వీరలు దీనిని దిగువ మూడు పద్యములలో నిట్లు వర్ణించిరి.

1 శా. పోలున్ శిష్యుఁలోకం దనధ్యయనమున్ బోనాడ మిట్టాడుచున్
మ్రోలన్ గాంచిలవించి తెచ్చెనిను, రేపోమాపో వారింటఁ గాఁ
జాలున్ బ్రాహ్మణి లక్షదీపముల దీక్షాకంకణోద్యాపనల్
ఏలో లాశికొ పాత్రమైతివఁట అంతే చాలులేవిస్తరీ!

(ఒక గురువుగారి యొద్దఁ జదువుకొనుచున్న విద్యార్థి గురువులయింట జరుగనున్న లక్షవర్తివ్రతోద్యాపనకై విస్తళ్ళుగావలసి అనధ్యయనము (అట విడుపు) నాఁడు తోటయొద్దకుఁ బోయి ముందు బాగుగా ఆకులతోఁ గన్పించుచున్న చెట్టును జూచి ఆ యాకులు గోసితీసికొనిరాఁగా ఏ ముత్తైదువయో ఆ పాత్రలో భుజింపఁగా విసిరివేయ బడినదంట, నీ యా అదృష్టము గొప్పదే సుమా!)

2. శా. పూగుత్తుల్ విదిలించునట్లు చిఱునవ్వుల్ రువ్వ నెమ్మోవితో
పూగప్రాయపుఁ గన్నెచన్నుఁగవ దోబూచాడఁ బయ్యంటలో
రేగిరేగనిముంగురుల్ నొసట నర్తింపగ ఏ చానబా
హాగంధామల పీచికల్ విసరనిన్నందించెనో విస్తరీ !

(ఏ యొకఃప్రాయపుఁగన్యయో పూలగుత్తులు విదలించునట్లు నవ్వుచుఁదన ప్రాయమునకుఁ దగినపాలిండ్ల పయ్యెదతో, ముంగురులు మొగమున వ్రేలాడుచుండఁ బద్మినీజాతికి సహజముగానుండు సువాసనగల బాహువులతో భోజనముచేయు ముత్తైదువునకు ముందు భాగమున నీ విస్తరిని వేసియుండుఁనట.)

3. మ. కడియాలంఁదెలు గల్లుగల్లుమని మ్రోగన్ విందులో సందడిన్
మెకలోఁగాసులదండ పూలసరులన్ మెత్కొల్వడన్ విభ్రమిం
చెడి శృంగారపువారి కోడవిజరీ చీరంచుకు గుచ్చెళ్ళుగుం
పెడు నిన్నీడ్చుకు పోవుచందమిని నవ్వించెంగదె విస్తరీ !

(ఆరోజులలోఁ బాదభూషణములగునందెలు, కడియాలు మ్రోగుచుండఁగా,కంఠభూషణములు మెలికలు పడుచుండ ఆ విందులసందడిలో తొందరగా నడచు ధనవంతులకోడలి జరీచీరకుచ్చెళ్ళు ఈ విస్తరి నీడ్చుకొని పోవుచుండఁగా నచటి వారందఱు నవ్వియుందురట.)

రవిగాంచనిచోఁ గవిగాంచునేకదా! అన్నట్లు వీరా వెనుకటి దృశ్యములు జూచినట్లే వర్ణించిరి. చివరికా విస్తరి యంత్యదశలో "నీగతి యీవిధింబరిణ మించెగాదె" అని తిరుపతి వేంకట కవులన్నట్లుగా,నయ్యిప్రోగులోనికిఁబోయినది. అందుకనియే "దానికుట్టు, పూసకుట్టు దానిబ్రతుకు దిబ్బబ్రతుకు" అను పొడుపుకథ యేర్పడినది. కావున జుగుప్సిత వస్తువును గూడఁ గవులు రమ్యముగా వర్ణింపఁగలరు కనుకనే కాబోలు.

"నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాది గౌణవృత్తివ్యపాశ్రయం
అతిసుందరమన్యత్తు గ్రామ్య కక్షాం విగాహతే॥

నిష్ఠ్యూతోద్గీర్ణ వాంతాదిశబ్దములు గూడ గౌణవృత్తి నాశ్రయించి అతిసుందరములగునట లేనిచో హేయములగునట. ఇట్లాలంకారికులు నిర్వచించి యున్నారు.

ఈ కవుల కిద్దరికిని కులపక్షపాతముగాని యితర కులద్వేషముగాని లేదు. దీనికుదాహరణ :-

"మాలకాకులు" అని వీరెచ్చటనో ప్రయోగింపఁగా దానినిజూచి కొందఱు భ్రాంతిపడి ఇది యొక కులమును కించపఱచుటగాదా? యని పత్రికాముఖమున వారినడుగగా సమాధానమును బత్రికా ముఖముననే యిచ్చుచు రాయప్రోలువారు "అది కులపరముగా వాడఁబడినదిగాదు అని కోశము (డిక్షనరీ)ను ఆధారముగాఁ జూపుచు పెద్దఆకృతిగల కాకులని అర్థముచెప్పిరి.

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని గురించి వారి గురువులు సిద్ధాంతపరముగా నుడువుచు "ప్రాజ్ఞవీనమ్ములన్ పక్షపాతములేక మంచిత్రోవలు సమ్మతించెనితఁడు" అనివ్రాసిరి. మరియు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు

"ఆహా ! సుబ్రహ్మణ్య పండితుని యాశయము లెంతగొప్పవి? వీనినిబట్టి వీరి నవీనతాభిమానము వ్యక్తమగుచున్నది. అవ్వారిపండితుఁడు ప్రాచీన వాఙ్మయమును దఱచిన లక్షణ వేత్తయైనను నూతనత్వ

మెఱుఁగని ఛాందసుడుగాఁడు. ప్రస్థాన త్రయము పాఠించిన వేదాంతియైనను రసతత్త్వము తెలియని శుద్ధశ్రోత్రియుడు గాఁడు. ఈయన గొప్ప దేశాభిమాని" అని వ్రాసినాడు.

మరియొక యుదాహరణ :-

ఏమోయీ! మనము జాషువాగారి యింటికివెళ్ళి చూచిరావలెనన్నారట. అయ్యా! మీరు శతావధానులు. విద్వాంసకవులు, మహాకవుల కోవకుఁజెందినవారు గదా! ఆయనను జూచివచ్చుట దేనికనగా-"కాదోయీ! మనకవిత్వములు సంస్కృత పాండిత్య బలాకృష్టములైన కవితలు, ఆయన సహజమైన తెలుగుకవి. ఆయనను తప్పకవెళ్ళి చూచిరావలె"నని చెప్పినారని ప్రతాప వేంకటేశ్వర కవిగారు చెప్పిరి.

సుబ్బారావుగారితోఁగష్ట సుఖములను బంచుకొనిన వారిసతీమణి వరలక్ష్మమ్మగారు వారిశాశ్వత వియోగమును సహింపలేకయో అన్నట్లు రాయప్రోలు వారు కన్నుమూసిన కొద్దిరోజులకే యిటీవల 1984 అక్టోబరులో కాలధర్మము చెందిరి. కావున ఆమెను గూర్చి కొంచెముగా నిచ్చటఁబ్రస్తావించుట ప్రస్తుతము కాకపోదు. నేను 1978లో వారియింటికి వెళ్ళినపుడు అప్పటికి రెండుమూడు రోజులు ముందుగానే హైదరాబాదులో రాయప్రోలువారికి సన్మానము జరిగినది. అప్పుడు వారి సతీమతల్లిని గూడగట్టిగ రమ్మని ఆహ్వానసంఘ కార్యకర్తలు తీసికొని వెళ్ళిరి. రాయప్రోలు వారిప్రక్కనఁ గూర్చుండఁబెట్టి ఫోటోతీసిరి. అది యామెకు దెలిసినట్లు లేదు. ఆ ఛాయాచిత్రము ఆ క్రిందటిరోజు పత్రికలోఁబడినది నేను వెళ్ళిమిమ్ములను గూడా బత్రికలో జూచితిననఁగా "నాయనా! నేనెప్పుడును సభలకు వారితోఁగలిసి కూడ వెళ్ళలేదు. మొన్ననన్నుపట్టుపట్టి గట్టిగా దీసికొనివెళ్ళిరి. ఫోటో తీసినట్లు తెలియదు" అనగా ఇదిగో అని అచటనున్న పత్రికనుదీసి "ఇదిగో మీ బొమ్మ" అనగా ఆమె అమాయకముగా ఆశ్చర్యముగాఁ జూచినది. అంతకుముందామెకుఁ దెలియనే దెలియదు. ఇట్టి సుప్రసిద్ధ నవయుగ వైతాళికుని పతిగా బడసిన యా యిల్లాలు అప్పటిలో ఒంగోలు తాలూకా కంబముపాడు గ్రామములో గూడ పేరమ్మ కోటయ్య అను పుణ్యదంపతుల మూఁడవ పుత్రికగా జన్మించినది. ఈమెకు నరసింహము చిదంబర శాస్త్రిరలను సోదరులుగలరు. చిదంబర శాస్త్రిగారు మంచి సంస్కృతాభిజ్ఞులు, మైలవరపు లక్ష్మీబాయమ్మ వావిలాల వేంకట సుబ్బమ్మ అను జ్యేష్ఠ సోదరీలు గలరు. ఇప్పుడు వారెవ్వరును లేరు. గాని చిదంబర శాస్త్రి గారి కుమారులు శ్రీ సుబ్రహ్మణ్యము గారు అను సహృదయులు ఉపాధ్యాయ వృత్తి నవలంబించి పుత్ర పుత్రికా సంతానముతో సుఖమున్నారు

అమలిన శృంగారము రాయప్రోలు వారి యుపజ్ఞము. దీనిని గూర్చి హైదరాబాద్ సభలో డాక్టర్ జి వి. సుబ్రహ్మణ్యము మున్నగువారు ప్రశ్నలు వేయఁగా సమాధానములు చెప్పివచ్చితి నన్నారు.

ఇచట నొకమాట:-

డాక్టర్ సి. నారాయణరెడ్డి మహోదయులు తమ "ఆధునిక కవిత్వ" మను పుస్తకములో 34, 35 పుటలలో వారిలోని నవ్యతకు పాదులు వేసిన వారిలో వారి పిన్నిగారు ప్రథమ స్మరణీయులు. పిన్నిగారి మాటలే అమలిన శృంగారమునకు దోహదము చేసినవనియు, ఆ సిద్ధాంతానికి, ఆ కాలమే ప్రాతిపదిక అనవచ్చునని వ్రాసిరి.

దాంపత్య శృంగారము గానిదే ప్రమలిన శృంగారమనియు సంభోగ శృంగారమునకు శవాసనలగ్నమని పేరుపెట్టి నిషేధించితిననియూ, అమలిన శృంగారమునకు శయనాసన యోగమని పేరుపెట్టితి ననియు శృంగారశ్శుచిరుజ్జ్వలః' అని కలదుగదా! అనియు' ఈ క్రింది పద్యమును నాకు వారు స్వయముగా జెప్పిరి.

తల్లిం బిడ్డలలో నవీనమయి వాత్సల్యంబు మైత్రీశర
న్మల్లీ పుష్పసుగంధమౌ సఖుల సాంత్వస్నేహ
రాగమ్మై యా
వల్లోక ప్రియమైన దంపతుల అద్వైతాను బంధమ్మై వ
ర్తిల్లున్ ప్రేమరసార్ణవామృతము పూరింపన్ దివారా
త్రముల్

ఈ అమలిన శృంగారమునకు దోహదము చేసిన పిన్నిగారెవరు? ఆమె స్వరూప స్వభావము లెట్టివి? అనుదానిని గూర్చి వీరెట్లు చెప్పినారు. అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు వీరికి సాక్షాత్తు మేనమామలా? తమ విహార భూమిగా వీరుగానము చేసిన వెదుళ్లపల్లి యెట్టిది? యెచ్చటిది? అను విషయమూలాసక్తికరము లైనవి గలవు పిన్నిగారెవ్వరో నేనడుగఁగాఁ జెప్పిరి. తక్కిన విషయములు నాకు తెలియును. వానిని గూర్చి చాల వ్రాయవలసి యున్నది.

ఇంతేకాక వీరు రవీంద్రనాథ టాగూర్ గారి శాంతినికేతనమున నెప్పుడు ప్రవేశించిరి? అచ్చట టాగూరు గారు, ప్రార్థనా సమావేశమున వీరినిఁ గూర్చి యెట్లు పరిచయము చేసిరి? దానిని బట్టి టాగూర్ గారికి మన తెలుగువారి యెడ నెంత యాదరమున్నది? దానికి మూలకారణమేమి? శాంతినికేతనములోని విధుశేఖర భట్టాచార్యుల వారికి కాళిదాస మల్లినాథ సూరులను గూర్చి యెట్టి యభిప్రాయములున్నవి? రాయప్రోలు వారికి, తెలుగుఁ కవులైన నాచన సోమన, పెద్దన మున్నగువారిపైనను సంస్కృత కవులైన వాల్మీకి, కాళిదాస భవభూతులను గూర్చి యెట్టి యభిప్రాయము లున్నవి? వాటి కావ్యములలోని విశేషార్థములను వీరు గ్రహించిన తీరెట్టిది? కాంతాసమ్మితము కావ్యమున్నప్పుడు కాంతాశబ్దమున కేయర్థము చెప్పవలెను? కావ్యము, రసము, మున్నగు వానివిషయమున వీరి అభిప్రాయము లెట్టివి? మున్నగు విషయములెన్నో వారు సూచించినవి గలవు. వానిని గూర్చి వ్రాయుట కిందవకాశము లేదు. ఇప్పటికే వ్యాసము విస్తృతి చెందిన దను మిత్రుల సలహాతో దీనిని నింతటితో నుపహరించుచు నింకొససారి కాలాంతరమున వానిని వెలువరించి ఆంధ్ర పాఠకుల కందింపవలెనను నుబలాటముతో, రాయప్రోలు వారు చివరిగా, 'నిర్దుష్టముగా వ్రాసిచూపుమ'ని నన్ను కోరిన శాంతివాక్యములతో వారి ఆత్మశాంతిని కోరుచు ఇప్పటికి విరమించుచున్నాను.

"పూర్ణమః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే"
ఉదచ్యతే = ఉద్రిచ్యతే ఉద్గచ్ఛతీత్యేతత్.

రిటైర్డ్ లెక్చరర్, శ్రీలక్ష్మీ భవనము
గార్లపాడు, వయా కాకుమాను
గుంటూరు జిల్లా. పిన్ 522112.

## స్వర్ణోత్సవ హిందీ పరిచయ పరీక్ష

| | |
|---|---|
| పరీక్షతేదీ | 26-10-86 |
| దరఖాస్తు రుసుము స్వీకరించు తేది | 18-10-86 |

కార్యదర్శి

# నవాబుల 'సునక వివాహం'

యం.వి. పాపన్నగుప్త

జొన్నగడ్ నవాబు సరు మహబత్‌న్. రసూల్‌న్ గారు ఒకప్పుడు అతనికి బుద్ధి సరిగాలేకుండెను. అతని ఆప్తులు ఇది గ్రహించి చింతించిరి. కానీ అతని ప్రవర్తనను ప్రశ్నించే దమ్ములు లేకుండిరి' అతని మనస్సుకు నచ్చినది, తనకు కలలో కనపడినది తక్షణమే ఆచరణలోనికి తెచ్చెడువారు. నవాబు వద్ద ఒక మంచి ఆడకుక్క వుండెను దానిపేరు 'రోషనార' అని పిలుచుచుండిరి, అది చిన్ననాటినుండీ నవాబు వద్ద పెరిగి పెద్దదైనది. అందువలన నవాబునకు దానిపైన అమితమైన ప్రేమ. అందుచే నవాబు దానికి రాజోపచారములు చేయుచుండెను, కానీ రాజపుత్రులకు ఇది చాలా కంటకముగా వుండెను, కొన్నాళ్ళకు నవాబు ఆ కుక్కకు వివాహము చేయవలెనని కలగన్నాడు. కలలో కలిగిన అనుభవాలు నెరవేర్చియే తీరాలి అను నియంత్రణ అతనికి వుండెను కదా! వెంటనే తన దివాన్ వక్ అల్లా భక్ష్ గారిని పిలిచి రాజయోగ్యత రీతిగా 'రోషనార'కు వివాహము చేయాలని అందుకు తగిన ఏర్పాట్లు చేయమని ఆజ్ఞాపించెను.

వివాహ పత్రికలు అచ్చువేయించి భారతదేశములో గల రాజులు, నవాబులు, బ్రిటీష్ ప్రభుత్వ అధికారులకు ఆహ్వాన రూపముగా పంపించెను. ఆహ్వానమందుకున్న ఆనాటి వైస్‌రాయి గారు ఆశ్చర్యముతో భిమురైై ఆహ్వాన పత్రికను చించివేసెను.

మగకుక్క తరపు వారిని ఎదురుకోట వేడుకకై రైలు స్టేషనుకు తన పట్టపుదేనుగుపై తనకుక్కను కూర్చుండబెట్టి దాదాపు ఊరిలోగల పురజనుల యొక్క సునకములను రెండువందల యాభై (250) వరకు పరివారముతో, బ్యాండ్ వాయిద్యములతో బంధుమిత్ర సమేతముగా స్టేషనుకు వెళ్ళిరి. అచ్చటికి రాజ బంధువులు, మంత్రి మండలి, ఉన్నతోద్యోగులు పట్టణములోని అధికార అనధికారులెల్ల రావించి వినోదము చూచుటకు తండోప తండములుగా విచ్చేసిరి.

(Mogrol)"మంగ్రోల్" నవాబుగారివద్ద మంచి కుక్క ఒకటి వుండెను దానిపేరు 'బాబి'. బాబికూడా రత్నభూషణాలతో అలంకరించి విలువైన చీనాంబరములను ధరింపచేసి తీసుకవచ్చిరి. సైనికులు కవాతు వందనము లాచరించి గౌరవించిరి. తదుపరి రాజమందిరము లోని దర్బార్ హాలునకు గొప్ప వూరేగింపుతో గొనిపోయిరి. మంచి ముత్యముల హారమును రోషనార మెడలో వేసిరి. బాబికి కూడా కాళ్ళకు బంగారు కడియములు తొడిగిరి. పట్టువస్త్రములు గప్పిరి ఈ సమారంభమునకు సంస్థానములోని ఆఫీసులకెల్ల 8 రోజులు సెలవులిచ్చిరి. దాదాపు 50 వేల మందికి భోజన వసతులు గావించిరి. ప్రతిరోజు ప్రాతఃకాలము అల్పాహారములతోనూ, రెండు పూటలు భోజనాలతోనూ మూడురోజులు ఆరగింపచేసిరి. పొరుగూరు వ హరాజులైన బరోడా, ఇండూర్ మున్నగు

మహారాజులు, జమిందారులు' జాగిరుదార్లకు రాజ భోజనం సంప్రీతిగా వొనిర్చిరి.

రాజ పురోహితుడు వేలాదిమంది ప్రజల సమక్షములో అతివైభవముగా పెండ్లి కార్యము జరిపించెను. ఈ వైభవమును గాంచుటకు ప్రతిరైలు నూరారు మందిని గొనివచ్చి పట్టణము నింపివేసెను. వచ్చిన వారికెల్లా అతిధి సత్కారములు గావింపబడెను. కోటలోని అతిధి గృహమందు 'రోషనారకు' స్థానమేర్పరచిరి. దాని ప్రక్కన 'బాబీ'ని వుంచిరి, ఆ నూతన వధూవర జాగిలములకు సంప్రీతిగా మృష్టాన్నమును పెట్టి తృప్తిగా భుజింపచేసిరి. ఈ వినోదమును భారతదేశములోని పత్రికలన్నియూ ఫోటోలతో సహా చిత్రవిచిత్రముగా వ్రాసి ప్రకటించిరి.

అనంతరము వరుడైన బాబితో దాదాపు నూరు కుక్కలను సపరివారముగ సాగనంపిరి. ఈ వైభవము పురస్కరించుకొని 21 మార్లు గౌరవ తుపాకి వందనములు గావించిరి. 'బాబికి' కోటలో మకమల్ పరుపు తయారు చేయించిరి నిత్య ప్రతి నిత్యము వధూవరులకు షడ్రసోపేతముగా భక్ష్యములు చేసి పెట్టిరి. తదుపరి వరుని వూరికి సాగనంపుటకు వూరిలోని వారు కూడా తమ సునకములను వేయికి పైగా వూరేగింపులో పాల్గొనచేసి సాగనంపిరి.

జొన్నగడ్డ నవాబు తన అంత్యకాలమువరకు రోషనారను తనకుమార్తె వలే చూచుకొనుచూ' రాజమర్యాదలను అందజేసి సంతసించెను.

ఈ వినోదమును గమనించిన "జింద్" సమస్థానాధిపతి 'రణవీర సింగ్' 'పాటియాల సమస్థానాధిపతి మహారాజా 'భూపేష్‌సింగ్ గార్లు కూడా తమ తమ సంస్థానములలో ఈ రీతిగానే తమ తమ జాగిల శ్రేష్ఠులకు వైవాహికములను ఓనర్చిరి.

(అనువాదం)

మదనపల్లి, చిత్తూరుజిల్లా

# మనవి

1. "స్రవంతి మాస పత్రికకు" చందా కట్టునపుడుగాని, ఉత్తర ప్రత్యుత్తరములు జరుపునపుడుగాని దయచేసి తమ చందానంబరు తప్పక పేర్కొనగలరు.
2. "స్రవంతి" చందా 10-00 రూ॥ల నుంచి 15-00లకు పెంచబడినది. కావున 10 00-చందాకట్టినవారు మిగతా 5-00 పంపగలరు.

ఇట్లు
**సంపాదకులు**

# హిందువా? ముస్లిమా?

హిందీ మూలం:
**ధర్మవీర్ భారతి**

అనువాదం :
**మాధవరావు రేగులపాటి**

ప్రభుత్వ హాస్పిటల్ యొక్క వరండాలో దాదాపు ముప్పది పీనుగలు ఒక వరుసలో పరుండబెట్టబడినవి. వాటిని శవాలు అనుట పొరపాటు. కాని అవి బ్రతికి ఉన్నవని చెప్పుటకూడ పొరపాటే వారి బొక్కలగూళ్ళమీద ముడుతలు పడిన తోలుపచ్చడాలు కప్పబడియున్నవి. వారిని చికిత్సకొరకు కలకత్తాలోని విచిత్రమైన వీధులనుండి తెచ్చారు. వారికి ఆకలిఅన్న రోగం అంటుకుంది. నడుస్తూ నడుస్తూ రోడ్లమీద పడి పోతుండేవారు. తరువాత మెలమెల్లగా ప్రాణాలువిడిచే వాళ్ళు. హిందుస్తాన్ వంటి మనదేశంలో కరువువచ్చిన నాడు ఒక విచిత్రమైన రోగంవస్తుంది. ఈనాడు అలాగే ఒక విచిత్రమైన రోగంవచ్చింది. పల్లెటూళ్ళ నుండి వస్తున్న వాళ్ళు ముందువెనకలు చూడకుండ నడుస్తూ నడుస్తూ కుడిఎడమలు గమనించకుండ రైలు పట్టాంపైపడిపోయి ఇకలేచే ప్రసక్తిలేకుండ ఉన్నారు. పాలకులు దీనిని సత్యాగ్రహము యొక్క నూతన పద్ధతిఅనుకున్నారు. వైద్యశాఖవారు దీనిని మలేరియా యొక్క క్రొత్తరకమైన రోగమని అనుకున్నారు; అది బెంగాల్‌లో సర్వసాధారణంగా వస్తుండేది. కాని కల కత్తాలో ఈ రోగముఅంతటా వ్యాపించింది. రోడ్లపై ధనవంతుల కార్లకు అడ్డంగా, ప్రభుత్వ వాహనాలకు ఆటంకంగా మరియు సైనిక మోటార్లకు అవరోధంగా అనేక శవాలు పడిఉండటముచూచి ప్రభుత్వ దృష్టి ఆ వైపు మరలింది. అందుకే ప్రభుత్వ సిబ్బంది ఆక లితో మరణించనున్న ముప్పదిమందిని తెచ్చిప్రభుత్వ వైద్యశాలలలో మెత్తని పరుపులమీద పరుండ బెట్టారు. డాక్టర్లు మరియు నర్సులు అంతా ఆశ్చర్య పోయారు. ఇదేమి ఒకేసారి ముప్పది రోగులా? అని అనుకున్నారు.

వరండాలో నిశ్శబ్దం ఆవరించింది, ఒక భయానక శ్మశానవాటికలో ఆవరించుకొన్న అత్యంత భయంకర వాతావరణంలా వరండాలో అంతటనిశ్శబ్దం అలుము కుంది. హఠాత్తుగా ఒకనర్సు తపాతపాబూట్ల శబ్దము చేసుకుంటు వరండామెట్లను ఎక్కుతుంది. మెట్లుఎక్కు తున్నప్పుడు ఆమెచెప్పుజారిపడింది. ఆమె దానిని సవ రించుకుంది. ఆమె నడుస్తున్నప్పుడు వచ్చిన చప్పుడు పడుకున్న రోగిగుండెను తాకింది దానితో ఆరోగితన పక్కను కదల్చాడు. ఆ నర్సు అతని ప్రక్కనుండి నడుస్తువెళ్తున్నప్పుడు ప్రయత్న పూర్వకంగా 'నీళ్ళు' అని అన్నాడు.

నర్సు ఒక్క నిమిషము ఆగింది.

"ఆరే ఒక్కదానిని ఎంతగా చేయాలి, ప్రొద్దటి నుండి ఇప్పటి వరకు బట్టలైన సర్దుకోలేదే!" అని ఆమె ముందుకు వెళ్ళిపోయింది.

దప్పితో కూడుకొన్న రోగియొక్క ప్రేగులనుండి మరొక్కమారు బాధాకరమైన మూల్గు వినిపించింది. "నీళ్ళు"

"దావని'' అని నర్సు అన్నది ఆ ప్రక్కనేఉన్న ఒక గదిలోకి వెళ్ళి అద్దంముందు నిలబడి తన మెడలో వ్రేలాడుతున్న దస్తి ముడిని విప్పుకుంది.

"నీళ్ళు" అని చస్తున్న ఆ వ్యక్తి యొక్క కంఠం అరచింది. నిజంగా ఆ అభాగ్యుడు అయిన రోగిచావు బ్రతుకుల మధ్యన పడిఉన్న ముడిని విప్పాలని యత్నిస్తున్నాడు.

నర్సు తన గదిలోని ద స్త్రీయొక్క చిక్కుముడిని విప్పాలని అనుకుంటుంది. ఆరోగి నిశ్శబ్దంగా ఉండి పోయాడు. నర్సు తనగుడ్డలు సవరించుకొని వెళ్ళి పోయింది.

రోగిమూల్గులు తక్కువ కాలేదు. ఆ ప్రక్కనే ఉన్న ఒక ముదుసలి తన కొంగుముడిని తీసి తలను బయటకు పెట్టింది. ఆ తర్వాత ఆమె లేచింది. ఆమె బొక్కల గూడులా ఉంది. అమె లేచి నిలబడి ఒక దబ్బాలో నీళ్ళుతెచ్చి అతని నోటిలో పోసింది. అతడు అప్పుడే అంతిమశ్వాసను విడుస్తున్నాడు. మొదట గ్రుక్కెడు నీళ్ళులోనికి పోయినవి. రెండవగ్రుక్కెడు నీళ్ళు బయటకు వచ్చినవి. ఆ ముదుసలి ఒక్క నిమి షము ఆ రోగిని విషాదంగా వీక్షించింది. ఆతర్వాత తన గొంగడిలో దూరిపోయింది.

ఇంతలో ఆ నర్సు డాక్టర్‌ను తీసికొనివచ్చింది. మరియు దప్పితో అలమటిస్తుపడి ఉన్న ఆ వ్యక్తి వైపు చూపింది. డాక్టర్ స్టెతస్కోపుతో పరీక్షిం చాడు. ఆ పేదవానిదప్పి చిరకాలంగా తగ్గిపోయింది. డాక్టర్ తన స్టెతస్కోపు దూరంగా తీసికొని ఒక విచిత్రమైన శబ్దంతో అన్నాడు. "అయిపోయింది."

తర్వాత జేబులోనుండి నోట్‌బుక్ తీశాడు. గడి యారం చూచి టైంనోటు చేసుకున్నాడు. నర్సుతో అడిగాడు. "ఈ రోగిని ఎక్కడనుండి తెచ్చారు?" అని.

"సప్లై ఆఫీసుముందునుండి" అని నర్సు అన్నది.

"హిందువా? ముస్లిమా?"

"తెలియదు"

"ప్రక్కన ఉన్న రోగిని అడుగు"

నర్సు ప్రక్కన ఉన్న రోగిని లేపింది. కాని ఆ రోగి లేవలేదు.

డాక్టర్ తనబూట్లతో ఆ కంబళిని దూరంగా తీసే శాడు. మరియు బిగ్గరగా అరిచాడు, "లే"

ఆ ముదుసలి భయపడి లేచింది.

"ఈ మనిషి ఎవరు?" అని డాక్టరు అడిగాడు.

"అయ్యా ఇతడు ఆకలితో చచ్చేవాడు."

"ఆకలా?" దానిని ఎవ్వరు అడిగాడు. చక్కగా జవాబు చెప్పు అని "డాక్టరు ఆమెను బెదిరించాడు."

నర్సు ఆమెకు తెలియజెప్పింది. చూడు. ఇది సర్కారువారి పని. అతడు ఆకలిగా ఉన్నాడా లేదా అన్నది ప్రశ్నకాదు. అతడు హిందువా లేదుముస్లిమా రజిష్టర్‌లో నమోదు చేయాలి" అని నర్సు మెల్ల మెల్లగా చెప్పింది,

"తెలియదు, దొరా! అని ఆ ముదుసలి అన్నది.

"సరే ఆ ప్రక్కన ఉన్నవానిని అడగండి." అని ఆ డాక్టరు ఆ నర్సుకు సలహా ఇచ్చాడు.

అటువైపు ఉన్న ఆరోగికూడ పలుకలేదు. ఎందు కంటే అతనుకూడ చనిపోయాడు. మరి చనిపోయిన వాడికి మతము ఏమిటో తెలియదు. చనిపోయినవాడు భగవంతుని దగ్గరకు వెళ్ళిపోయాడు.

డాక్టర్ అతని అసిస్టెంట్‌ను పిలిచి అతనితో ఇలా అన్నాడు "ఒక్కొక్కరికి ఒకఘాటైన ఇంజక్షన్ ఇచ్చి పంపించు లేకుంటే మిగిలిన వారంతా చనిపో తారు.

"ఇక్కడ కాకుంటె బయట చనిపోతారు." అని అతని అసిస్టెంట్ అన్నాడు.

"బయట చనిపోతే ఫరవాలేదు. ఇక్కడ చనిపోతే ప్రభుత్వానికి చెడ్డపేరు వస్తుంది. పేపర్‌వాళ్ళకు రిపోర్టు వ్రాయాలి. వైద్యశాలలో కేవలము ఏడుగురు చనిపోయారు. మిగిలినవాళ్ళంత ఇక్కడికి వచ్చే లోపున చనిపోయారు." అనివ్రాయించి తర్వాత ఆకలితో బాధపడుతున్న వాళ్ళందరిని అక్కడినుండి పంపించివేశారు.

ఆ ముదుసలి ఎంతో నీరసంగ ఉంది. నాలుగు అడుగులు నడిచి ముందుకు పోయింది. అక్కడే కూలబడిపోయింది.

ఎప్పుడైతే ఆకలి పేగులను మెలివేయడం మొదలు పెట్టిందో అప్పుడు మరల ప్రయత్న పూర్వకంగాలేచి ముందుకు నడిచింది.

అమెప్రక్కనే ఒక సబ్బులదుకాణం ఉంది. ఆ దుకాణంముందు ఒక చౌకీదారు ఉన్నాడు. అతడు చాల బలిసి ఉన్నాడు. ముదుసలి అతని ముందుకు పోయింది. చేతని ముందుకు చాచిందికాని ఏమి అడుగ లేకపోయింది. చౌకీదారు ఆమెను చూశాడు. వికటాట్ట హాసము చేశాడు. "పో!పో! నువ్వు యువతివైతే నీ శీలాన్ని అమ్ముకుంటే ఎవ్వడైనా ఎనిమిది, పదిపైస లిచ్చేవాడు. ఇప్పుడు ఏ నెపము మీద బిచ్చమెత్తుకో వడానికి వచ్చావు? పో!పో!" అని కసురుకున్నాడు,

ముడుతలు పడిన ఆ ముదుసలి కన్నులనుండి లజ్జాకరమైన రెండు కన్నీళ్ళు కదిలినవి.

ఆమె వెనుతిరిగిందోలేదో మరల పిలిచాడు, "నీకు భిక్షము కావాలికదా! ఈ దేశంలో భిక్షంపెట్టేవాళ్ళు తక్కువలేరు. అదిగో అక్కడ మారువాడి వాళ్ళు అన్న సత్రము పడ్డిస్తున్నారు."

"ముదుసలి అక్కడికి వెళ్ళింది. అక్కడలెక్కకు మిక్కిలి గుంపుఉంది. లెక్కలేని కంకాళాలు కబళము కొరకు చేతులు చాచిచూస్తున్నై. ఉడుకుతున్నవంటల వాసనలు గుబాలిస్తున్నై. ఆ ముదుసలి ఒక దీర్ఘ శ్వాసను తీసింది బహుశా శ్వాసద్వార తన పొట్టను నింపుకోవాలని ప్రయత్నిస్తుందేమో అన్నట్లు

కార్యకర్తలు దేక్‌చను అక్కడ తెచ్చి పెట్టారు. అందరికి అన్నము పంచారు. చాల అల్లరిగా ఉంది. ఆ ముదుసలి మెల్లగా లేచింది, తదుపరి కుక్కను తరి మివేసి ఆ దేక్‌చను నిరర్ధకంగా గీకడానికి ప్రయ త్నించింది.

ఇంతలో ఒక కార్యకర్త అరిచాడు' "చూడు, చూడు, ఆ ముదుసలి ఆ దేక్‌చను ముట్టుకుంది."

"దేక్‌చను ముట్టుకుంది హిందువా లేక తురకదా?"

"తురకవలె అనిపిస్తుంద."

"గెంటేయ్-వెధవరాల్ని."

ఆ ముదుసలి తల్లి తిరస్కారభావంతో బాధపడి లేచింది. ఆమె తప్పేముంది.

ఎదుట ఒక డాబాఉంది. అక్కడికి వెళ్ళింది. ఆమె మొదట సాహసించలేదు. కాని ఆ డాబా మీద ఒక ఝుండా ఉంది, ఆ ఝుండా మీద చుక్కలు చంద్రుడు ఉన్నాడు....అది ఆకుపచ్చఝుండ.

దానిని చూచిన తర్వాత ఆమె మనస్సు కుదుట పడింది. ఎదుట ఒక స్వయం సేవకున్నాడు. అతడు అతనిని ఆపివేశాడు. "ఇక్కడ కేవలం తురకలకు మాత్రమే అన్నం పెట్టబడుతుంది."

"నేనుకూడ తురకనే" అని ముదుసలి తల్లిజవాబు చెప్పింది.

"ఎదుటి బంగ్లాలో తినివచ్చావు, నీవు కాఫిర్‌వు; నిజంగా కాఫిర్‌వే; నీముఖమే చెప్పుతుంది." రెండవ స్వయంసేవకుడన్నాడు.

"పో!పో!" ఇక్కడ కాఫిర్లకు స్థానంలేదు. తొలగిపో !"

ఆ ముదుసలి ముఖము చిట్లిపోయింది మరియు ఒక్కసారి బిగ్గరగా అరచింది., "దేవుని దాసులారా! భగవంతుడు ఏ తిండిగింజమీద మతాన్ని వ్రాసిపంప లేదు. మీ పిచ్చిమాటలు వినినేను తురకను అని చెప్పు కోవడానికి సిగ్గవుతుంది.''

"పిచ్చిది!'' అని ఒకడన్నాడు.

''ఆకలితో ఆమె మెదడు చెడిపోయింది.''

"భగవంతుడు కాఫిర్లకు ఇలాంటి శిక్షనే వేస్తాడు ! అని వణుకుతు ఆమె ఒక దిక్కు వెళ్ళిపోయింది.

రెండవరోజు కలకత్తాయొక్క ఒకదైనిక పత్రికలో ఇలా అచ్చైంది.

"బెంగాల్ యొక్క ఈ కరువుకాలంలో సమస్త భారత దేశములో ప్రాంతము, మతము అన్నిభేద భావములు మరచిపోయి అందరికి సహాయము అందిస్తున్నారు. మార్వాడీలు, ముసల్మానులు అందరు సార్వజనీకాభోజనాలయములను స్థాపించరు. ఈవిషయంలో ప్రభుత్వ ఆస్పత్రుల సహాయము కూడ మరువరానిది. వీరందరి ఎడ కృతజ్ఞతలు."

దాని క్రిందనే మరిఒక చిన్న వార్త అచ్చైంది. "ప్రభుత్వ ఆస్పత్రులసేవ మూలంగా ఆకలిచావుల సంఖ్య తక్కువగా ఉన్నప్పటికి, అక్కడక్కడ చావులు సంభవిస్తున్నై. తురకలబంగ్లా వద్ద ఒకశవం పడిఉంది. ఆమెను సరియైన సమయంలో ఆస్పత్రికి తరలించని కారణమువల్ల ఆమె మరణించింది. ఆమెను పాతిపెట్టాలో లేదా దహనము చేయాలో సమస్యతేల కుండాఉంది...ఎందుకంటే ఆమె హిందువో ? ముస్లిమో ?''

రీడర్,
కాకతీయ యూనివర్శిటీ
వరంగల్-506010



వార్తావాహిని

## హిందీ విజయపత్ర వితరణోత్సవము, గంగుబూడి

ఆగస్టు 16న గంగుబూడి కేంద్రమునుండి సభచే నిర్వహింపబడిన ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష పరీక్షలలో ఉత్తీర్ణులయినవారికి విజయ పత్రములు ఒసంగబడినవి. సభకు తెలుగుదేశం శాసనసభ్యులు శ్రీకోళ్ళ అప్పలనాయుడుగారు అధ్యక్షత వహిస్తూ జాతీయ భాషాభివృద్ధికి కృషిచేయుచున్న హిందీప్రచారకులను అభినందిస్తూ ఉపన్యసించారు. సభ ఆర్గనైజరు శ్రీమతి వేదవల్లి, ఆదర్శహిందీమహావిద్యాలయం అధ్యాపకులు శ్రీఎమ్. శేషాచారిగారు కూడా సభలో పాల్గొని విద్యార్థులకు ఆశీస్సుల నొసంగారు. శ్రీ కె. యస్. యస్. నారాయణరావు విచ్చేసిన అతిథులకు ధన్యవాద సమర్పణతో సభ ముగిసినది.




(కవితా సంపుటి)
రచన : చెళ్ళపిళ్ళ సన్యాసిరావు (ఎం.ఏ).
ప్రతులకు సి. హెచ్. సన్యాసిరావు
శ్రీ కృష్ణలీలా నిలయం
గుళ్ల సీతారాంపురం-532 128
శ్రీకాకుళం జిల్లా. వెల: 5-00

కవిత్వపు పోకడల్లో అనేకానేక మార్పులు ఉద్భవించాయి. ఛందస్సునుండి శాస్త్ర ఇచ్చవచ్చిన రీతిలో వ్రాయడం విస్తరించిన ఈ రోజుల్లో వచన, మినీ, గేయ కవిత్వానికి ఆదరాభిమానాలు అధికమయ్యాయి. ప్రస్తుత పరిస్థితుల్లో విరామం లేని జనావాళికి మినీ కవిత్వం అహ్లాదాన్నిస్తుందనడంలో అతిశయోక్తి లేదు. ఈ నవ్యకవితా రీతుల్లో కూడా అనేక రూపాలున్నాయి. వైష్ణవ్యం, భావం, సామాజిక స్పృహ, దేశభక్తి, మొదలగునవి వీటిల్లో సామాజిక స్పృహకు ప్రాధాన్యత వుందని చెప్పవచ్చు.

శ్రీ సన్యాసిరావు గారి "కవితామృతం" లోని దాదాపు అన్ని కవితలూ సామాజిక స్పృహతో కూడు కున్నవే దీనిలోని "అమృతం" అనే కవితను పరిశీలిస్తే భావగర్భితంగా వుంది. "సమత, మమత, మానవతలను మొలిపించే ప్రేమామృతం పంచుతున్నారు." అంటారు కవిగారు. ఆ అమృతం పేరు "స్నేహం-ప్రేమ" అంటాడు. శ్రీ రావు గారు లయబద్ధమైన కవిత్వం కూడా రమణీయంగా వ్రాస్తారు, దానికి నిదర్శనంగా ఈ క్రింది పంక్తులు పరిశీలించవచ్చు.

మమత లేని మత మెందుకు, సమత లేని మతమెందుకు
గుళ్ళను పీల్చే మతమెందుకు, ఒళ్ళను కాల్చే మత
మెందుకు
మనం ముందు పుట్టామా? మతం ముందు పుట్టిందా
మంచి లేని మతమెందుకు? వంచన గల మతమెందుకు?

మానవత్వానికీ, దానవత్వానికీ రెండు వాక్యాల్లో నిర్వచన మిస్తూ వ్రాసిన క్రింది కవిత చూద్దాం.

"మనిషి మనిషిని దోచుకునేది దానవత
మనిషి మనిషిని ఆదుకునేది మానవత"

అనడం సమంజసం.

కవితలతో కళామతల్లి కంఠమందు కవితా హారాన్ని వేసిన ఈ కవి ధన్యజీవి, ముమ్ముందు అనేకానేక అభినందనీయ రచనలు రావుగారు చేయగలరని ఆశిద్దాం.

-శేషం సుప్రసన్నాచార్యులు

# వార్తావాహిని

## హిందీకి సన్మానం
## లయన్స్ క్లబ్, గన్నవరం

5-9-1986 తేదీన లయన్స్ క్లబ్ అధ్యక్షులు శ్రీ వి. రామమోహన రావు గారి అధ్యక్షతన ఉపాధ్యాయ దినోత్సవం జరిగింది. సెక్రటరీ జె. వి. బి. కుమార్, జాయింట్ సెక్రటరీ జె. మోహనరావు, ట్రెజరిర్ ఎమ్. పి. చౌదరిగార్లు సారథ్యము వహించిరి. స్థానిక భేకన్ ఫ్యాక్టరీ జనరల్ మేనేజరు శ్రీ రాఘవేంద్ర రావు గారు ప్రముఖులు డాక్టర్ శ్రీ జి. వెంకటేశ్వర రావు, ప్లీడరు శ్రీ ఎమ్. హనుమంతరావు గార్లు కూడ యీ సభలో పాల్గొనిరి. జె. మోహనరావు గారి ప్రార్థనతో సభ ప్రారంభమైంది.

స్థానిక వి. కె. ఆర్. కాలేజి తెలుగు శాఖాధిపతి డా॥ వి. లక్ష్మారెడ్డి గారు, జాతీయోద్యమము, దానితో పాటు సాగుతూవచ్చిన జాతీయ భాష హిందీ ఉద్యమ మును గురించి సవివరంగా చెప్పిన అనంతరం, ముఖ్య అతిథి శ్రీ కాజ వేంకటేశ్వరరావు గార్ని యీ క్రింది విధంగా సభ వారికి పరిచయం చేసిరి.

అనేకమంది జాతీయోద్యమ నాయకుల అనుచరులు ప్రముఖ జాతీయవాది, జాతీయభాషహిందీప్రచారసారధీ పూజ్య బాపూజీ నుంచి డిప్లొమా పొందుట ద్వారా ప్రేరణ పొందిన మన వెంకటేశ్వర రావు గార్ని లయన్స్ క్లబ్ సన్మానించటం ఎంతేని హర్షించదగిన విషయము. శ్రీ వెంకటేశ్వరరావు గారు సాహిత్యాభి లాషియగుటచే, కొన్ని రచనలు కూడ చేశారు ప్రస్తు తము దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్ర కార్యవర్గ సభ్యులు గాను, విజయవాడ హిందీ మహా విద్యాలయం ప్రిన్సిపాల్‌గాను వుంటున్నారు, ఈ సందర్భములో మన "లయన్స్‌క్లబ్" ను గురించి వారి చిన్న గీత మొకటి వినిపించి శ్రీ వెంకటేశ్వర రావు గారి పరిచయం ముగిస్తాను.

'లయన్స్' ఏమంటున్నది
కలతలకు కళ్ళెం వేసి
మమతలకు హారతులిచ్చి
మనసులను కలపమంటున్నది.
మీరు మేము అంతా ఒకటే నంటున్నది.
దేశమంతా ఒకటే నంటున్నది.

'లయన్స్' మనకొక మార్గదర్శిని
సొసైటీ కొక కరదీపిక
గంతవ్యమునకొక గమనం
స్ఫ్రేరణా పోషణ కది అవుసరం

ఇది శ్రీ వేంకటేశ్వరరావు గారి ఆశయం. మన కొక ఉద్బోదం అంటూ ముగించిరి. అనంతరం మరొక ముఖ్య అతిథురాలు స్థానిక గరల్స్‌హైస్కూలు ప్రధానోపాధ్యాయిని శ్రీమతి డి. ప్రమీలారాణి గారి పాఠశాల పాలనా నైపుణ్యము, బాలబాలికలను ఆదర్శవంతులుగా తీర్చిదిద్దుట యందామెకున్న ఆసక్తిని గురించి పెద్దలుపన్యసించిరి. అనంతరం ఆదర్శోపాధ్యాయులు శ్రీ కాజ వెంకటేశ్వరరావు, ఆదర్శోపాధ్యాయిని శ్రీమతి ప్రమీలారాణి గార్లను,

లయన్స్ క్లబ్ వారు నూతన వస్త్రముల తోను, మెమొంటోలతోను ఘనంగా సన్మానించిరి. సన్మానితులు ఉచితరీతిని సమాధానము చెప్పిన పిదప జనగణమన గీతంతో సభ జయప్రదంగా ముగిసింది.

## హిందీ ప్రచారకుల సమావేశం. సిద్దిపేట

ది. 16-9-86 మధ్యాహ్నం 3గం॥లకు మెదక్ జిల్లా హిందీ ప్రచారకుల సమావేశం సిద్దిపేటలో జరిగింది. డిగ్రీకాలేజి లెక్చరర్ శ్రీకులసిరెడ్డిగారు సభకు అధ్యక్షత వహించారు. న్యూహైస్కూల్ ప్రధానాధ్యాపకులు ముఖ్యఅతిథిగా విచ్చేశారు. సర్వశ్రీ వేముగంటి నరసింహాచారిగారు, కే. రాజయ్యగారు, పి. వి. బ్రహ్మయ్యగారు, ప్రముఖ వ్యాపారస్తులు శ్రీకన్హయ్యలాల్ బలదేవగారుకూడా ఈ సభలో పాల్గొని హిందీ భాషా ప్రచారాభివృద్ధికోసం తమ అమూల్యసలహాలను ఇచ్చారు.

సిద్ధిపేట కేంద్రంలో హిందీ పరీక్షల్లో ఎక్కువ మార్కులు తెచ్చుకున్న విద్యార్థినీ విద్యార్థులకు శ్రీ కన్హయలాల్ బలదేవ్‌గారు బహుమతులనిచ్చి ఆశీర్వదించారు.

ప్రముఖ హిందీ ప్రచారకులు, చాలా సం॥లుగా హిందీ ప్రచారంకోసం సభ తరపున పనిచేసిన కార్యకర్త శ్రీ యస్. వెంకటేశ్వర రెడ్డిగారు ఈ సమావేశాన్ని ఏర్పాటుచేసి నూతనోత్తేజాన్ని కలిగించారు. ధన్యవాద సమర్పణతో సభముగిసింది.

## హిందీ మహావిద్యాలయం- విజయవాడ

హిందీ మహా విద్యాలయ సమాపనోత్సవము 11-8-1986 తేదీ సాయంత్రము, దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర కార్యాలయ భవనములో, ఆంధ్రసభ అధ్యక్షులు శ్రీవేమూరి సుబ్బారావుగారి అధ్యక్షతన జరిగింది. ఆంధ్రశాఖ కార్యదర్శి శ్రీఅన్నదానం రామస్వామిగారు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు.

బాలికలు చిరంజీవులు గౌరి, శ్రీలక్ష్మి, సుజాత వసంతలు మనోహరంగా గానంచేసిన, వందేమాతరం "సారేజహాఁసే అచ్ఛా" గీతములతో సభ ప్రారంభమైనది.

అనంతరం విద్యార్థినీ విద్యార్థుల నుద్దేశించి మాట్లాడుచూ, శ్రీ ఎ. రామస్వామిగారు—

వివిధ ప్రాంతీయ భాషల విశిష్టతను తనదిగాచేసుకొని శక్తివంతమైన భాషగా పరిఢవిల్లి దేశసమైక్యతను కాపాడగలిగిన ఎకైక భాష హిందీయేనని వక్కాణించిరి.

సభాధ్యక్షులు వేమూరి సుబ్బారావుగారు మాట్లాడుతూ, విజయవాడ స్వరాజ్యము రాకపూర్వమునుంచి హిందీ ప్రచారకార్యకలాపములకు కేంద్రముగా ఉంటూ వచ్చినదనియు, భవిష్యత్‌లోకూడ, ఉత్సాహపూరిత హిందీ వాతావరణం నెలకొని ఉండటానికిగాను, తగు పథకము తయారుచేసి, మా భవకాశంఉన్నంతవరకూ, సభద్వారా కృషి చేయగలమని అంటూ, విద్యార్థులు నూటికి నూరుశాతం పరీక్షలందు త్తీర్ణులు కావలసిందిగా దీవించిరి.

హిందీ భాషనభ్యసించటంలోగాని, ప్రచారంలోగాని నిరుత్సాహపడవలసిందేమియు లేదనియు, జాతీయంగాను, అంతర్జాతీయంగాను ఆ భాషకున్న ప్రాధాన్యతను ఉగ్గడిస్తూ శ్రీ ఎమ్. సుబ్బారావుగారు విజయవాడ పట్టణం పేరులోగల విశిష్టతను, మరియు హిందీ విద్యాలయములను గురించి శ్రీ పి. ప్రసాదరావుగారు తమ ఉపన్యాసములలో వివరించిరి.

మహావిద్యాలయం విద్యార్థినీ విద్యార్థుల తరపున ప్రధానాచార్యులు కాజవెంకటేశ్వరరావుగారు, సభ అధ్యక్ష, కార్యదర్శులను ఘనంగా సన్మానించిరి. విద్యార్థి శ్రీనివాస్ అభినందనములతో సభముగిసింది.

మరొక విశేషం—

విజయవాడ హిందీమహావిద్యాలయం సమాపనోత్సవ సందర్భములో, అభిజ్ఞవర్గములద్వారా, దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్రశాఖవారు, హిందీ మాధ్యమం, బి.ఏ. విద్యాలయం విజయవాడలో నడుపుటకు ప్రణాళికను సిద్ధం చేస్తున్నట్లుగా తెలియ వచ్చింది. విశారద, ప్రవీణ పరీక్షల్లో ఉత్తీర్ణులైన హిందీ విద్యార్థులకు ఇదొక శుభవార్తగా నమ్ముచున్నాము.

## హరిహర హిందీ విద్యాలయం, ఏలూరు

"హరిహర హిందీవిద్యాలయం"అనుబంధ సంస్థయైన "శ్రీ మారుతీ ట్యుటోరియల్స్" తృతీయవార్షికోత్సవ సందర్భమున ది. 25-9-86 సాయంత్రం 6గం॥లకు శ్రీ పొట్టి పాండురంగారావు ప్రిన్సిపాల్, హిందీ దర్బార్ వారి అధ్యక్షతన దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర) ఉపాధ్యక్షులు శ్రీ కట్టా పూర్ణానందరావు గార్కి, పశ్చిమ గోదావరి జిల్లా ఆఫీస్ సూపరింటెండెంట్ గారైన శ్రీ శృంగారం వెంకట శేషాచార్యులు గార్కి సన్మాన సభ ఏర్పాటు చేయడమైనది.

తొలుత శ్రీ మారుతీ ట్యుటోరియల్స్ ప్రిన్సిపాల్ శ్రీ కలబరిగి నారాయణమూర్తి స్వాగత వచనాలతో, పండిత, జన, మంగళ వాయిద్యాలతో శ్రీ కట్టాపూర్ణానందరావు గార్ని, శ్రీ శృంగారం వెంకట శేషాచార్యులు గార్ని సభాస్థలికి ఆహ్వానించారు.

శ్రీ కట్టా పూర్ణానందరావు గార్ని మంగళ వాయిద్యాలతో, వేద మంత్రాలతో హరిహర హిందీ విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ ఎన్ వి ఎస్ ఎన్ రామానుజాచార్యులు దుశ్శాలువతో సత్కరించారు. తదనంతరం శ్రీ శేషాచార్యులు గార్ని సభాధ్యక్షులు శ్రీ పొట్టి పాండురంగా రావు గారు దుశ్శాలువతో సత్కరించారు

సన్మానితులు శ్రీ కట్టా పూర్ణానందరావు గారు మాట్లాడుతూ తనకు జరిగిన సన్మానమునకు కృతజ్ఞత తెలుపుతూ, హిందీ ప్రచార ఉద్యమానికి తన వంతు సహాయ సహకారములను ఎల్లవేళల అందించగలవాడనని అన్నారు.

శ్రీ అలహ సూర్యనారాయణ, దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర) కార్యవర్గ సభ్యులు మారుతీ ట్యుటోరియల్స్ విద్యార్థినీ, విద్యార్థులకు బహుమతి ప్రధానం చేసారు.

శ్రీ పిన్నింటి సత్యనారాయణ, ప్రిన్సిపాల్, హిందీ నికేతన్ వారు హిందీ పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థిని విద్యార్థులకు ప్రమాణ పత్ర వితరణ చేసారు

శ్రీ పటగర్ల రామమోహనరావు, దక్షిణభారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర) కార్యవర్గ సభ్యులు ప్రసంగిస్తూ మారుతీ ట్యుటోరియల్స్ శత వార్షికోత్సవాలు చేసుకోవాలని ఆశీర్వదించారు.

॥లు పొట్టి పాండురంగా రావు గారు మాట్లాడుతూ హిందీ భాషాభివృద్ధికై కలబరిగి నారాయణమూర్తి చేస్తున్న కార్యక్రమాల్ని కొనియాడారు.

ప్రత్యేక ఆహ్వానితులుగా సభకు హాజరైన శ్రీ తూతా లక్ష్మీసూర్యసత్యనారాయణ మాజీ మున్సిపలు చైర్మన్ గారు ప్రసంగిస్తూ పూర్ణానంద రావు గార్కి, శేషాచార్యులు గార్కి సన్మానం జరగటం చాలా ఆనందదాయకమైన విషయమని అన్నారు.

ఆహుతులు పలువురు ప్రసంగిస్తూ హిందీ భాషా ఔన్నత్యాన్ని కొనియాడారు శ్రీ ఎమ్ బాల శంకర్, ప్రిన్సిపాలు, భార్గవీ ఎడ్యుకేషనలు కోచింగ్ సెంటర్ వారు ప్రసంగిస్తూ శ్రీ కట్టా పూర్ణానంద రావు గార్కి, శేషాచార్యులు గార్కి తన అభినందనలు తెలిపారు.

సభకు అనేక మంది హిందీ ప్రచారకులు, పట్టణ ప్రముఖులు, పత్రికా విలేఖరులు హాజరైనారు.

సభానంతరం శ్రీ ఎన్ వి ఎస్ ఎన్ రామానుజాచార్యులు తమ స్వగృహంలో విందు ఏర్పాటుచేసారు.

(స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుతున్న హిందీ పండితులు)



పేరు : మామిళ్ళ సత్యనారాయణ

వృత్తి : హిందీ పండిట్, జన్మస్థానం : కర్నూలు కేంద్రం : నంద్యాల, యోగ్యతలు: యస్ యస్.యల్ సి. మరియు హిందీ శిక్షణ ప్రవీణ, ఆగ్రా (ఉ.ప్ర.) అభిరుచి : హిందీ ప్రచారం మరియు పరిచయ పరీక్ష నందు ప్రత్యేక కృషి. చిరునామా : మామిళ్ళ సత్యనారాయణ, హిందీ పండిట్, ఇం.నెం. 28/1052-బి విద్యానగర్ టీచర్సు కాలనీ, నంద్యాల. ఆర్.యస్. 518502 (కర్నూలు జిల్లా)



పేరు : యం. సీతాలక్ష్మి

అర్హతలు ; రాష్ట్రభాష ప్రవీణ, సీనియర్ హిందీ పండిట్, సాహిత్య రత్న, బి.కాం., టైపురైటింగ్ హిందీ హైస్పీడు ఇంగ్లీషు హైయ్యరు, తెలుగు హయ్యరు, షార్టుహ్యాండు : హిందీ. ప్రిన్సిపాల్, ఆదర్శ కమర్షియల్ టైపు ఇనిస్టిట్యూటు, అభిరుచి : హిందీ, హిందీ టైపు, హిందీ షార్టుహాండుల ప్రచారం ఆజీవన సభ్యత్వము : దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు.



పేరు : వి. జోగులాంబ

వృత్తి : హిందీ పండిట్, కేంద్రం కాకినాడ, అభిరుచి : హిందీ ప్రచారము. హిందీ పరిచయ పరీక్ష నందు ప్రత్యేక కృషి చిరునామా : వి జోగులాంబ, నెహ్రూ హిందీ విద్యాలయం, ఇంటి నెంబరు 7-4-28, శేషశాయివీధి, రామారావు పేట కాకినాడ-4 తూర్పు గోదావరి జిల్లా

## (స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుతున్న హిందీ పండితులు)



**పేరు : జంగా కృష్ణమూర్తి**

పుట్టినతేది : 5-9-1938, అర్హతలు : P U.C, సాహిత్య రత్న, కార్యక్షేత్రము : ప్రథమశ్రేణి, హిందీ పండితుడు, జి. ప ఉన్నత పాఠశాల చెక్కిళి, అభిరుచి : 1962 వ సంవత్సరము నుండి హిందీ ప్రచారము చేయుచుంటిని. నెల్లూరు, కనిగిరి, గూడూరు, వెంకటగిరిలలో అనేక మంది విద్యార్థులను ప్రాథమిక నుండి ప్రవీణవరకు కూర్చొ బెట్టి యుంటిని. ఆధ్యాత్మిక విషయములందు ఆసక్తిగలదు సేవాకార్యక్రమములందు పాల్గొనుట అభిరుచి., చిరునామా : జె. కృష్ణమూర్తి హిందీ పండిట్ 2-242 నరసింగరావు పేట గూడూరు నెల్లూరు జిల్లా 524102.



**పేరు : యం. డి. అబ్దుల్ రహమాన్**

వృత్తి : గ్రేడ్ 1 హిందీపండితులు, కార్యక్షేత్రం Z P. H S నవాబుపేట, యోగ్యతలు : యం. ఏ సాహిత్యరత్న. ప్రచారక్, అభిరుచి: వక్తృత్వ పోటీలలో పాఠశాల స్థాయినుండి కళాశాల స్థాయివరకు ప్రథమ బహుమతి తీసుకొనిరి. హిందీ ప్రచారము. స్కౌటింగ్ (Scouting) పరిచయ పరీక్షయందు ప్రత్యేక కృషి. సాంస్కృతిక కార్యక్రమములందు పాల్గొనుట. చిరునామ : H-No 8-8-20/1 గుండ్ల గడ్డ, జనగామ, వరంగల్ 506175.



**శ్రీ బెహరా ఉమామహేశ్వరరావు**

అర్హతలు : యం ఏ యం. ఇ. డి; సాహిత్య రత్న, అభిరుచి : స్వర్ణోత్సవ సమితికి ప్రత్యేక కృషి, దేశాటనము. ప్రస్తుత కార్యక్షేత్రం : కాలేజీ లెక్చరర్ (హిందీ) అరకువేలీ- 531149

# ఉచ్చ శిక్షా ఔర్ శోధ్ సంస్థాన్

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

## బి.ఎడ్. పరీక్షకు గుర్తింపు

గాంధీ విశ్వవిద్యాలయం, కొట్టాయమ్ వారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, పోస్టు గ్రాడ్యుయేట్ అండ్ రిసెర్చి కాంప్లెక్స్ వారు నడుపుతున్న బి.ఎడ్. పరీక్షను తమ విశ్వవిద్యాలయం నడుపుతున్న బి ఎడ్ పరీక్షకు సమానంగా అంగీకరించారు.

GANDHIJI UNIVERSITY

(Abstract)

Recognition of Examination/Degrees of Statutory Universities/Foreign Universities on a reciprocal basis--Orders Issued-

ACADEMIC 'AI' SECTION

No. Ac AI C/305/86 Kottayam, dt 25-7-1986

Read: Minutes of the meeting of the Standing Committee of the Academic Council held on 30 5-1986

ORDER

Sanction has been accorded by the Vice-Chancellor to the following Examinations/Degrees of the respective Institutions/Universities being recognised as equivalent to the corresponding examinations/Degrees of the Gandhiji University on a reciprocal basis subject to the Satification by the Academic Council

| Name of the Universities/ Institutions | Name of the Degrees. | Corresponding Degrees of the Gandhiji Uty. |
|---|---|---|
| Dakshina Bharat Hindi Prachar Sabha, Madras | B. Ed | B, Ed |
| Ravishankar University, Raipur | B Sc. (Supplementary English, Chemistry, physics and Mathematics on optionals and B Ed. (Evaluation & Measurement as Optionals) | Acceptable qualification for the post of H. S. A. in Mathematics |

| | | |
|---|---|---|
| Bangalore University, Bangalore | B. A. (Correspondance Course) | B. A |
| Bundelkhand Universty, Jhansi | M A. (History) | M. A. (History) |

Orders are issued accordingly.

Sd/-
Assistant Registrar
For Registrar

To

1. The Controller of Examinations
2. The Deputy Registrar (Exams)
3. P. S. to the V C/P. V. C 4. Academic Section BI
5. Academic Section B II 6. EK I Section 7. P. R. O. Section
8. Stock file 9. File copy.

Forwarded/ By Order
Sd/-
Section Officer
//True Copy//

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్రశాఖకు ఇటీవలజరిగిన ఎన్నికలలో ఏకగ్రీవంగా ఎన్నుకోబడిన కార్యవర్గసభ్యులు

### కె. ప్రహ్లాద గుప్త ఆళ్లగడ్డ



శ్రీ కొప్పురపు ప్రహ్లాదగుప్త గారు 28-7-1939న ఆళ్ళగడ్డలో లక్ష్మీనరసయ్య సుబ్బమ్మ అనువైశ్యదంపతులకు జ్యేష్ఠపుత్రునిగా జన్మించారు. వీరి విద్యాభ్యాసము ఆళ్ళగడ్డ, ఏర్పేడు, తిరుపతి, విజయవాడ, తెనాలిలలో జరిగినది. సంస్కృతములో భాషాప్రవీణ, హిందీలో విద్వాన్ పట్టభద్రు లయ్యారు 1960 లో హిందీ ప్రచారరంగములో ప్రవేశించి క్రియాశీలురై ఆళ్ళగడ్డలో హిందీ మహావిద్యాలయము జూనియర్ హిందీ పండిత ట్రైనింగ్ కాలేజీలను సమర్థవంతముగ నిర్వహించారు. సంస్కృత చైతన్య పాఠశాలను స్థాపించి ఉచిత సంస్కృత భాషా ప్రచారము సాగించుచున్నారు. వీరు 1972 లో పదకండ్ల యందు ఒక ఉన్నత పాఠశాలను స్థాపించారు 1978 లో ప్రభుత్వము నుండి ఈ ఉన్నత పాఠశాల పూర్తిగ్రాంటును పొందినది. చక్కని క్రమశిక్షణలో వీరు హైస్కూలును కరస్పాండెంటుగా నిర్వహించు చున్నారు. వీరు ఆధ్యాత్మిక భావములు గలిగిన పూర్వాచా ర పరాయణులు.



గన్నవరం లయన్స్ క్లబ్ వారి సన్మాన సందర్భములో దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర కార్యవర్గం సభ్యులు ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి ప్రధాన కార్యదర్శి శ్రీ కాజ వెంకటేశ్వరరావు గారికి, జె.వి.బి.కుమార్, డా॥ గొంది వెంకటేశ్వరరావు గార్లు మెమొంటో అందజేస్తున్నారు.



ది. 10-8-86న గుంటూరులో ప్రేమీమండలి వారి ఆధ్వర్యమున జరిగిన ప్రమాణపత్ర వితరణోత్సవములో, ద.భా. హిందీ ప్రచార సభ-ఆంధ్ర అధ్యక్షులగు శ్రీ వేమూరి సుబ్బారావు గారికి - ప్రేమీమండలి అధ్యక్షులు శ్రీ గుడివాడ పుల్లారావు గారు, కార్యదర్శి శ్రీ చింతలపూడి కుసుమహరనాథశర్మ పూలదండ, చందన, తాంబూలాదులు, నూతనవస్త్రములతో సన్మానించిన సందర్భమున తీయబడిన ఫోటో.

Edited, Printed and Published by A. Ramaswamy on behalf of the D.B Hindi Prachar Sabha-Andhra,-9 Khairatabad, Hyderabad-500 004.